# ఆంధ్రపత్రిక




The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No 258 WEDNESDAY 21st DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K.NageswaraRao


# 'ఆంధ్రరాష్ట్రం ఆర్థికంగా ఇంచుమించు స్వయంపోషకమయే వుంటుంది'

## ఆర్థిక ఉపసంఘంవారి పరిశీలన సమాప్తి

### విభజనసంఘ సమావేశానికి కావలసిన నివేదికలు సిద్ధం

చెన్నపట్నం, డిసెంబరు 21: చెన్నరాష్ట్ర విభజనసంఘం వారు ఉదయం 8½ గంటలకు మంత్రివర్గ మందిరంలో సమావేశమయ్యే సమయానికి, ఆర్థిక ఉపసంఘంవారి సిఫార్సులు మాత్రము సంసిద్ధం కాగలవనీ, ఆంధ్రరాష్ట్ర ఆర్థికస్థితిని గురించి రేపు విభజన సంఘం చర్చిస్తుందని తెలియుచున్నది. థార్ కమిటీవారు 6 కోట్ల 52 లక్షల రూపాయలు ఆంధ్రరాష్ట్రానికీ 5 కోట్ల 79 లక్షలు తమిళరాష్ట్రానికీ లోటు వుండగలదని తెలిపియుండిరి. ఇప్పుడు ప్రస్తుతం ఈ ఆర్థిక ఉపసంఘంవారు పరిస్థితిని పునర్విమర్శ చేసిన మీదట, ఆంధ్రరాష్ట్రానికి 2 కోట్లకంటే లోటు వుండదనియు, ఆ రెండుకోట్లూ కూడ మొదటి సంవత్సరాలలో రిజర్వు నిధినుంచి సర్దుకొనవచ్చుననీ, తర్వాత అమ్మకాలపన్ను మొదలైన క్రమశః వృద్ధియగు పన్నులవల్ల రాష్ట్రం ఆర్థికముగ స్వయం సమృద్ధము కాగలదనియు తెలిపినట్లు తెలియుచున్నది.

ఆర్థిక ఉపసంఘంవారు ఈ మధ్యాహ్నం ఆఖరుసారి సమావేశమై, తమ నివేదికను తయారుచేయనున్నారు.

సిబ్బంది ఉపసంఘంవారి చర్చలు పూర్తియైనవిగాని నివేదిక ఇంకను తయారుకాలేదు. రేపు మధ్యాహ్నంవారు బహుశా సమావేశం కావచ్చు. ఆర్థికస్థితిపై చర్చ ముగియు సమయానికి, సిబ్బంది నిర్ణయ సంఘంవారి సిఫార్సులుకూడ అందగలవని తెలియుచున్నది.

### ఏమాత్రం లోటువుండదని మరొక అభిప్రాయం

ఆర్థిక ఉపసంఘంవారు ఏర్పడనున్న ఆంధ్రరాష్ట్రం రాబడిఖర్చులగూర్చి పునరాలోచన చేసిరనియు, విభజనసంఘంలో అధికారేతరసభ్యుల సూచనపై థారుకమిషను చూపిన 6½ కోట్ల లోటుసరికాదని, యిప్పుడు సరియైన సంఖ్యలు తయారుచేసిరని తెలియుచున్నది.

థారుకమిషను సంఖ్యలలో రాబడి యందు ఆహారోత్పత్తి స్కీముల కింద 2½ కోట్ల లోటున్ను, ఖర్చులలో సిబ్బందికి 1½ కోట్లు ఎక్కువ ఖర్చున్ను చూపినట్లు తెలియుచున్నది. చెన్నరాష్ట్రములో ఆంధ్ర జిల్లాలంటే ఎక్కువ పండుచు యితర జిల్లాలకు ఎగుమతి చేయుచుండ, ఆహార దిగుమతికయే సబ్సిడీలోటు ఆంధ్ర జిల్లాల క్షేమార్థం పంచరాదనియు, ఆ 2½ కోట్లు లోటుగ చూపుట తప్పనియు యిపుడు సూచింపబడినది. ఆంధ్రరాష్ట్రం విస్తీర్ణమునందు జనసంఖ్యయందు మధ్యరాష్ట్రముతో పోలియుండును. ఆరాష్ట్రంలో గవర్నరునుండి తాశీల్దారువరకు వున్న సిబ్బంది ఖర్చులన్ని కలుపుతే 1 కోటిని మించలేదట. ఆప్రకారంగానే ఆంధ్రరాష్ట్రానికిగూడ లెక్కవేసినచో థారుకమిషను చూపిన యీ బాపతులోటు 1½ కోటికూడా యుండదు. ఇట్లే మదరాసు నగరంలోనికి ఆంధ్ర జిల్లాలనుండి వచ్చే రాబడికూడా (సేల్సుటాక్సు, స్టాంపు డ్యూటీ) మున్నగునవి కొన్ని, యిక్కడికిరాక ఆంధ్రరాష్ట్రానికే మిగులును కనుక యీ జమంతా చూచుకుంటే, ఆంధ్రరాష్ట్రమునకు లోటులేక, జమాఖర్చులు సరిపోవును లేదా యించుక మిగులును, అని ఆర్థికోపసంఘంవారు తీర్మానించినట్లు రూఢిగ తెలియుచున్నది.

## సిరియా రాజధానిలో తిరిగి పెద్ద పెట్టున సైనికవిప్లవం

### బాహ్యసంబంధాల విచ్ఛేదం: సేనాని మొదలైన ప్రముఖుల నిర్బంధం

డెమాస్కస్, డిసెంబరు 19: ఈవేళ సిరియా సేన డెమాస్కస్ నగరానికి మిగిలిన ప్రపంచంతో గల సంబంధాలన్నీ తెంచివేసి ఒక్కసారిగా సాయుధ సైనిక విప్లవం తీసుకువచ్చింది. గడిచిన తొమ్మిది నెలలలోను సిరియాలో జరిగిన విప్లవాలలో ఇది మూడవది. ఈ విప్లవానికి అరబ్ స్వాతంత్ర్య సైన్యానికి చెందిన కర్నల్ అబి డ్ షిస్ ఖక్లీ నాయకుడు. ఇతడు ప్రస్తుతం సిరియా సైన్యాధిపతిగా ఉన్న సామి హెన్నావీని నిర్బంధించాడని తెలుస్తున్నది.

ఈసామి హెన్నావి గత ఆగస్టు 14 వ తేదీన హుస్నీ జైమ్‌కు ప్రతికూలంగా విప్లవం లేవదీసి తన అధిపత్యం ప్రకటించుకున్నాడు. విదేశాంగ శాఖా కార్యదర్శి అస్సాన్ తిలాస్‌నుకూడా నేటి విప్లవసందర్భంలో నిర్బంధించారని తెలుస్తున్నది.

సైనికవిప్లవం చాలాచురుకుగాసాగింది. ముందుగా సైనికులు విమానాశ్రయం వశపరచుకున్నారు. ఆపిమ్మట ప్రభుత్వ భవనాలలోకి ప్రవేశించి వాటినికూడా వశపరచుకుని వీధులలో రాకపోకలు స్తంభింపజేశారు.

ప్రొద్దున్న తుపాకులు పేల్చిన ధ్వని వినిపించడంవల్ల హెన్నావీ అంగరక్షకులు కొంత ప్రతిఘటించారని ఊహించబడుతున్నది. లెబనాన్ రాజధాని బైరట్‌నుంచి వచ్చిన వార్తలనుబట్టి హెన్నావి అనుచరులు అయిదుగురు ముందుగా తమప్రాణాలు అర్పించారనీ అపిమ్మట నే హెన్నావీని నిర్బంధించడం జరిగిందనీ తెలుస్తున్నది.

### హెన్నావీ విడుదల

తరవాత బైరట్‌నుంచి వచ్చినవార్తలనుబట్టి సిరియా మాజీ అధ్యక్షునికీ, క్రొత్త అధ్యక్షునికీ మధ్యన సంప్రతింపులు జరిగాయనీ, ఈ సంప్రతింపుల ఫలితంగా హెన్నావీ విడుదల జరిగిందనీ, ఇతనికి పింఛను ఇవ్వడానికికూడా నిర్ణయం జరిగిందనీ తెలుస్తున్నది. కర్నల్ అన్వారీమహమ్మద్‌ను, నూతన సైన్యాధిపతిగా ప్రకటించారట.

## ఐక్య ఇండొనీషియా తొలి ప్రధానిగా డా॥ హట్టా ఎన్నిక

### స్వాతంత్ర్య ప్రదాన బిల్లుకు డచ్చి ఎగువ శాసనసభ ప్రాతికూల్యం

బటేవియా, డిసెంబరు 19: స్వతంత్ర ఇండొనీషియా అధ్యక్షుడు డా॥ సుకర్నోచే ఎన్నుకొనబడిన నలుగురు సభ్యులలో డా॥ మహమ్మదు హట్టా నమిగిలిన ముగ్గురూ స్వతంత్ర ఇండొనీషియా తొలిప్రధానిగా ఎన్నుకొన్నారని జోగ్జకర్తా రేడియో ప్రకటించింది.

### 27 వ తేదీన డచ్చిరాణిచే అధికారప్రదానం

న్యూఢిల్లీ, డిసెంబరు 20: డిసెంబరు 27 వ తేదీన ఐక్యఇండొనీషియా రిపబ్లిక్ మామూలుగా ప్రాదుర్భవిస్తుంది. కాని ప్రభుత్వశాఖలన్నీ డిసెంబరు 20 వ తేదీకే ఇండొనీషియనుల ఆధిపత్యం క్రిందకు రాగలవు." అని న్యూఢిల్లీలోని ఇండొనీషియన్ సమాచారశాఖా కార్యాలయం నిన్న ప్రకటించింది.

డిసెంబరు 27 వ తేదీన డచ్చిరాణీ, ఆమ్‌స్టర్‌డాంలో ఇండొనీషియాపై సర్వాధికారమును, ఇండొనీషియా ప్రతినిధి వర్గానికి వప్పగించివేయుచుంది. ఆదేసమయంలో ఇండొనీషియాలో డచ్చిరాణి ప్రతినిధి సర్వాధికారమును, జోగ్జకర్తా సుల్తాన్ పరంచేస్తాడు. జోగ్జకర్తా సుల్తాన్ను ఇండొనీషియా రిపబ్లిక్ రక్షణమంత్రిగ ఇండొనీషియా జాతీయరక్షణసన్నాహ సంఘముచే నియోగింపబడెను.

### 8777 ఖైదీల విడుదల

న్యూఢిల్లీ, డిసెంబరు 19: ఇండొనీషియాలో యుద్ధవిరమణ జరిగినాటినుండి ఇప్పటివరకు 8777 మంది రిపబ్లికన్ ఖైదీలను యుద్ధఖైదీలను డచ్చిఅధికారులు వదలిపెట్టారు. ఇంకా 1674 మంది ఖైదులో ఉన్నారు. వీరు వచ్చేవారం విడుదల అవుతారు.

### డచ్చిప్రాతికూల్యం

హేగ్, డిసెంబరు 19: ఇండొనీషియా స్వాతంత్ర్యంబిల్లుడచ్చి ఎగువశాసనసభలో ఆఖరు ప్రతిపాదనస్థితికి వచ్చిన తరుణంలో శాసనసభలోని మాజీ ప్రభుత్వాధికారులు కొందరు-విదేశీయుల ఒత్తిడి ఫలితంగా డచ్చి ప్రభుత్వం ఇండొనీషియాకు తల ఒగ్గిందని పిటిషన్ పెట్టారు.

ఈ పిటీషనును దఖలు పరచినవాడు డా. అలెగ్జాండరు లూడోన్. ఈయన యుద్ధకాలంలో అమెరికాలో డచ్చి రాయబారిగా పని చేశారు. "విదేశీయుల ఒత్తిడి ఫలితంగా స్వయం నిర్ణయవాక్కుకు స్వస్తి చెప్పడం వల్ల కలిగే దుష్ఫలితాలకు మా పూచీ లేదని డచ్చి ప్రభుత్వంవారు భద్రతా మండలికిన్నీ, ఐక్య రాజ్య సమితికిన్నీ నివేదించాలని ఎగువ శాసనసభ ప్రభుత్వానికి తెలపాలి." అని ఈ పిటీషను చెబుతున్నది.

## విదేశీయుల ఆస్తి అప్పుల వివరాలు

### 1950లో లభ్యం కాగలవని జాన్‌మత్తాయి

న్యూఢిల్లీ, డిసెంబరు 20: భారతదేశంలో విదేశీయుల ఆస్తిఅప్పుల వివరాలన్నీ తయారవుతున్నవనీ, 1950 ప్రారంభంలో లభ్యం కాగలవనీ ఆర్థికమంత్రి డా॥ జాన్ మత్తయిగారు నేడు పార్లమెంటులో ఒక ప్రశ్నకు సమాధానంగా తెలియజేశారు.

## ఒంగోలు - బెంగుళూరు రైలుమార్గం

### జనవరిలో కేంద్ర రవాణామండలి చర్చ:

న్యూఢిల్లీ, డిసెంబర్ 20: కేంద్ర రవాణామండలి సమావేశం జనవరి 6 వ తేదీన మద్రాసులో జరుగుతుంది. ఈ సమావేశంలో, మద్రాసు ఓడరేవును అభివృద్ధిచేసే విషయమై ఆలోచన జరుగుతుంది.

మద్రాసు రేవులో ఒకే దఫా 4 ఓడలు నిలిచి లంగరు వేసుకోవటానికి తగినట్టుగా అభివృద్ధిచేసే విషయం యోచన జరుగుతుంది.

ఈ దిగువ రైలుమార్గ నిర్మాణం విషయం కూడా చర్చించుతారు: (1) చామరాజనగర్-సత్యమంగళమ్-మెట్టుపాలెం (2) క్విలన్-ఎర్నాకులం (3) మంగుళూరు-హాస్సాన్ (4) దివాషవ్ నెర్-కారొజాట్ (5) కడపా-బెంగుళూరు (6) ఒంగోలు-బెంగుళూరు.

## 'విశ్వవ్యాప్తము గు విశాల దృక్పథమే సంస్కృతి'

### యువకులకు ప్రధాని నెహ్రూ ఉద్బోధ

లక్నో, డిసెంబరు 19: "ఈనాడు ప్రపంచములో ఎక్కడ జూచిన నక్కడ బ్రహ్మాండములగు మార్పులు జరుగుచున్నవి. ఈ మార్పులకును, ఈ పరివర్తనలకును అనుగుణముగా మనము నడుపవలసిన రీతుల మన మానసములు నూతన భావపరంపరా గ్రాహకములుగాను, అభివృద్ధి తరంగ గ్రాహకములుగాను ఉండవలెను" అని ప్రధాని పండిత జవహర్లాల్ నెహ్రూగారు లక్నో విశ్వవిద్యాలయ పతన బృందమువారు సంక్షేమ మొసంగుచు చెప్పుచున్నారు. ఈ బృందమువారు గత శనివారమునాడు ఐక్యరాజ్య సమితి సమావేశ ప్రహసనమును ప్రదర్శించి యుండిరి. ఈ అవకాశమును పురస్కరించుకొని పండిత నెహ్రూగారు సంతోషమందుచు యింకను యిట్లు చెప్పిరి.

"ఐక్యరాజ్య సమితి సమావేశమును అనుకరించు భావము నాకు నచ్చినది. మీ ప్రయత్నము జయప్రదము కావచ్చును. కాకపోవచ్చును. కాని అదిక్లిష్టమా పాత్రమైనది. అట్లుచేయు ప్రయత్నమే లాభదాయకముగా నుండును. ఐక్యరాజ్యసమితి కార్యకలాపములలోను, ప్రపంచ వ్యవహారములలోను విశ్వవిద్యాలయ విద్యార్థులకును, ఇతరులకును అది శ్రద్ధ హెచ్చింపజేయును. తమ దృక్పథమును విశాలము గావించునట్టియు, భవిష్యత్ కార్యక్రమ నిర్వాహణమునకు తమ్ము సంసిద్ధులుగా చేయ తోడ్పడునట్టి యిట్టి కార్యకలాపములను విద్యార్థులు చేపట్టుట అత్యంత వాంఛనీయము.

సంస్కృతి విషయమై ప్రస్తుత సమయమున మన దేశములో ప్రసంగము విశేషముగా జరుగుచున్నది. సంస్కృతి యనునది విశాలార్థములో వ్యక్తికి లేక జాతికి వుండవలసిన ఒక ముఖ్య సుగుణము. ఈ గుణమునుబట్టియే ఒక వ్యక్తి లేక జాతియొక్క యోగ్యతాయోగ్యతలను ప్రపంచము నిర్ణయించును. సంస్కృతి నాగరికతయొక్క ఉత్తమ పుష్పమే గాని అన్యము కాదు. ఒక దేశ జాతియొక్క సంస్కారము సంస్కృతిలో నిమిడియుండును. యావత్ ప్రపంచమును ఆవరించు విశాలతర దృక్పథము, యావత్ ప్రపంచము సాధించిన మహత్కార్యములను ఆవరించు విశాలదృక్పథము దానిలో నిండియుండును; లేదా యిమిడియుండవలెను. జాతీయ సంస్కారము లేనియెడల నది దుర్బలము, శక్తి విరహితమునై, కేవలము అనుకరణముగా పరిణమించును. విశాల దృక్పథము లేనియెడల నది సంకుచితమై, స్తబ్ధమై ప్రపంచమునందలి యితర భాగములలో జరుగుచున్న అభివృద్ధినుండి విడబడిపోవును. సంస్కృతిమనస్సుయొక్క ప్రధాన గుణము. మనస్సు సంకుచితంగా నున్న యెడల అదిగూడ సంకుచితమగును. పతన బృందములో చేరియున్న విద్యార్థులు చేయుచున్న దానికిని నేను చెప్పుదానికిని సంబంధము లేకపోవచ్చును. ఐనప్పటికీ పతనబృందమువారు ఐక్యరాజ్య సమితి సమావేశము అనుకరించు ప్రయత్నము వారి దృక్పథమును విశాలముగావించగలదని భావించుటచే యిట్లు చెప్పితిని."

## రిజర్వుబ్యాంకి అమ్మిన నిజాము బంగారం

### మొత్తం విలువ 80 లక్షలపైగా

న్యూఢిల్లీ, డిసెంబరు 20: భారత పార్లమెంటులో ఆర్. కె. సిధ్వా గారి ప్రశ్నకు సమాధానమిస్తూ ఖజానా శాఖ మంత్రి డా॥ జాన్ మత్తాయ్, నవంబరు 4 వ తేదీవరకూ నిజాం తరఫున 70,500 తులముల బంగారాన్ని రిజర్వు బ్యాంకివారు విక్రయించారని చెప్పారు.

సగటున తులం 114-9-3 చొప్పున 80,77,969 రూ. లు వచ్చిందని ఆయన అన్నారు. ఈ బంగారం నిజాం స్వంత సంపద యైనందున డబ్బు యావత్తూ ఆయనకే ముట్ట జెప్పబడిందనీ, ఇంకా బంగారం అమ్మబడే అవకాశాలున్నాయో లేదో అనకేమీ తెలియదనీ డా॥ మత్తయ్ టి. టి. కృష్ణమాచారిగారి ఉప ప్రశ్నకు బదులు చెప్పారు.

## మదరాసు అసెంబ్లీ సభ్యత్వ ఉపఎన్నిక

### భూస్వాముల నియోజకం ఎన్నిక తేదీలు

మదరాసు, డిసెంబరు 20: శ్రీ రాజా రావు వెంకటమహీపతి గంగాధర రామారావు బహదూర్ (పిఠాపురం యువరాజా) గారి రాజీనామావల్ల ఏర్పడిన భూస్వాముల ఉత్తర నియోజకవర్గ అసెంబ్లీ సభ్యత్వ ఎన్నికకు ప్రభుత్వము ఈ క్రింది తేదీలు నిర్ణయించెను.

అభ్యర్థుల నామినేషన్ 1950 జనవరి 6, నామినేషనుల పరిశీలన జనవరి 9, ఓట్లు తీసుకొనుట 1950 ఫిబ్రవరి 6 ఓట్లు లెఖ్ఖించుట ఫిబ్రవరి 9.

## కాశ్మీర్ సమస్యా పరిష్కారానికి మండలి అధ్యక్షుడు మెక్‌నాటన్ కృషి

### వాదప్రతివాదానికి ఉభయపక్షాల సన్నాహాలు

న్యూయార్కు, డిసెంబరు 19: ఐక్యరాజ్యసమితిలో చర్చించవలసి ఉన్న కాశ్మీరు సమస్య లేక్‌సక్సెస్ నుండి న్యూయార్కులోని జనరల్ ఆండ్రూ మాక్‌నాటన్ కార్యాలయానికి మార్చబడింది. జనరల్ మాక్‌నాటన్ భద్రతామండలికి ప్రస్తుతం అధ్యక్షుడు, కెనడా ప్రతినిధి.

శనివారంనాడు జనరలు మాక్‌నాటన్ పాకిస్తాను విదేశమంత్రి అయిన సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖానును కలుసుకొన్నారు. తరువాతి కార్యక్రమం నేడు కొనసాగనున్నది. ఇండియా పాకిస్తానుల ప్రతినిధులు తమతమ వాదనలను తయారు చేసుకొంటున్నారు. కాని ఈ చర్చలు కొనసాగించే క్రమాన్ని జనరలు మాక్‌నాటన్ ఇంకా నిర్ణయించలేదని తెలుస్తున్నది. ఆయన ఉభయ ప్రతినిధి వర్గాలతోనూ విడివిడిగా గాని, ఒకేసారి గాని చర్చలు జరపవచ్చును.

ఈ చర్చలలో భారత ప్రతినిధులకు సర్ బెనెగల్ నరసింగరావు నాయకుడుగా ఉంటారు. ఆయనవెంట భారత ప్రభుత్వ విదేశ వ్యవహారశాఖ ప్రధాన కార్యదర్శి సర్ గిరిజాశంకర బాజపేయీ, కాశ్మీరు ప్రధాని షేక్ మహమ్మదు అబ్దుల్లా గార్లుంటారు. పాకిస్తాను ప్రతినిధి వర్గనాయకుడుగా, పాకిస్తాను విదేశాంగ మంత్రి సర్ మహమ్మదు జఫ్రుల్లాఖాన్ వ్యవహరిస్తారు. ఆయనవెంట పాకిస్తాను సంచార రాయబారి ముస్తాక్ అహమ్మద్ గుర్మానీ ఉంటారు.

జనరలు మాక్‌నాటన్ భద్రతామండలి అధ్యక్షపదవికి ఇంకా 10 రోజులే గడువున్నది. ఈసంవత్సరాంతంతో అది రద్దయిపోతుంది కనుక ఈలోగా చర్చలు పూర్తి కావాలి.

## కామన్వెల్తు సభ: ఆస్ట్రేలియా ప్రాతినిధ్యం

కాన్బెరా, డిసెంబరు 20: ఆస్ట్రేలియా ప్రభుత్వ నూతన విదేశాంగమంత్రి పెర్సీ స్పెండర్ వచ్చే నెల కొలంబోలో జరిగే కామన్వెల్తు సమావేశంలో ఆస్ట్రేలియా తరఫున ప్రాతినిధ్యం వహిస్తారు.

## అఖిలభారత కళా ప్రదర్శనం

### రాజాజీచే ప్రారంభోత్సవం

హైదరాబాదు, డిసెంబరు 20: నేటి సాయంత్రం గవర్నరుజనరల్ రాజగోపాలాచారిగారు ప్రారంభోత్సవం చేసిన అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనం ఇదివర కెప్పుడూ కని విని ఎరగనంత అద్భుతంగా వున్నది. 1946 డిసెంబరులో జరిగిన గత ప్రదర్శనంకంటే ఇది ఎన్నోరెట్లు బాగుందని చెప్పవచ్చు. 1946 తరువాత సంస్థానంలోని అస్థిర పరిస్థితుల కారణంగా ఈ ప్రదర్శనం ఇప్పటివరకూ మళ్లీ జరగలేదు.

నేటి ప్రదర్శనశాలలో ఆటు కాశ్మీర్‌నుండి ఇటు కన్యాకుమారివరకు, బొంబాయినుండి బెంగాల్‌వరకూ ఈ విశాల దేశంలో ఎన్నిరకాల పరిశ్రమలు ఎలా వృద్ధి పొందుతున్నవో గమనించవచ్చు. పశ్చిమ బెంగాల్ పరిశ్రమల శాఖవారి విభాగంలో నూలు, సిల్కు బట్టలు, దంతపుపని, తోలుపని, ప్లాస్టిక్, కాగితం బొమ్మలు, కుంభకార పరిశ్రమ, తోళ్లు, తోళ్ల పరిశ్రమ, ప్రదర్శితమైనవి. పశ్చిమ బెంగాల్ మార్కెటింగు అధికారి జె. సి. రాయ్‌గారు స్వయంగావచ్చి తమ ప్రదర్శనను విజయవంతంచేయాలని శ్రమపడుతున్నారు.

బీహారు ప్రభుత్వంకూడా ప్రదర్శనానికి కొన్నివస్తువులను పంపించింది. గ్వాలియర్ నుండి చిత్రమైనకూజాలు, తిరువాన్కూరునుండి దంతపు వస్తువులు, బొంబాయినుండి పట్టుపని వస్తువులు, నాగోర్ నుండి అల్లికబుట్టలు, కాశ్మీర్‌నుండి సర్వజనులను ఆకర్షించే అందమైన చేనేత బట్టలు ప్రదర్శనానికి చేరాయి.

ఈ సంస్థానంలోని అన్ని జిల్లాలనుండి వివిధపారిశ్రామిక వస్తువులువచ్చాయి. వాటినిచూస్తే సంస్థానంలో ఎంతగొప్ప పనివాడితనంవున్నదో ఎదురుగా కనిపిస్తుంది. ముఖ్యంగా ఔరంగాబాదునుండి వచ్చినసిల్కుగుడ్డలు ఆకర్షకంగా వున్నాయి. వీటికిప్రాంతాల్లో గిరాకీ బాగావున్నది. ఈ ప్రదర్శనంలో హైదరాబాదు ప్రభుత్వం సంపూర్ణప్రాతినిధ్యం వహించింది.

# రాయలసీమను ఆంధ్రరాష్ట్రంలో చేర్చకూడదట

## రాష్ట్రప్రధానికి రాయలసీమ మహాసభవిన్నపం

చెన్నపట్నం, డిసెంబరు 19: అధ్యక్షుడు సి. ఎన్. నరసింహారెడ్డిగారి అధ్యక్షత్వాన, రాయలసీమ మహాజనసభ తరఫున ఆర్. సూర్యనారాయణరావు, ఎన్. మృత్యుంజయశాస్త్రి, బి. వేణుగోపాలాచార్య, డి. టి. శేషారెడ్డి, ఎస్. ఓబులరెడ్డి, ఓ. ఏ. చిన్నపరెడ్డి ఎల్. కొండప్పగారలు ప్రధానిని నేటి మధ్యాహ్నం కోటలో కలుసుకొని ఆంధ్రరాష్ట్రంలో రాయలసీమ జిల్లాలను చేర్చవద్దని, ఆంధ్రరాష్ట్రం లోటుగా వుంటుందనీ అందుచేత కొత్త రాష్ట్రంలో రాయలసీమ జిల్లాల అభివృద్ధి వెనుకపడుతుందనీ ఒక విజ్ఞప్తిని సమర్పించారు. వీరి విజ్ఞప్తిలో యీ విషయాలు వున్నవి.

"1938 నుంచీకూడా రాయలసీమ అభివృద్ధికి ఆంధ్రరాష్ట్రనిర్మాణం నిరోధకం కాగలదని మహాసభ చెప్పుతూ వచ్చింది. రాయలసీమజిల్లాలలో చెన్నరాష్ట్రాన్ని విభజించడంవల్ల ఆర్థికంగా నాటి అభివృద్ధి దెబ్బ తింటుంది. కొత్తరాష్ట్రంలో వీటి అభివృద్ధికి తగినంత ఆర్థిక సదుపాయం లభించదు.

బళ్లారిజిల్లాలోని 3 తాలూకాలు ఒక ప్రాంతంలోనూ, మిగతా తాలూకాలనూ మరొకదానిలోనూ విడదీయడం, కోస్తాంధ్రులను తృప్తిపరచడానికని ఈపని చేయడం వేసబబులనీ, బళ్లారిజిల్లాను ఇప్పటిలాగే ఒక పరిపాలనా ప్రాంతంగా వుంచమనీ కోరుతున్నాము.

తుంగభద్ర ప్రాజెక్టుయొక్క నిర్మాణ గమనం జిల్లాను విడదీస్తే దెబ్బతింటుంది.

ఆంధ్రరాష్ట్రం లోటుగా వుంటుందనే మాట నిర్వివాదం. నిత్యపరిపాలనకే డబ్బు వెతుక్కోవలసి వస్తుంది. మాచ్‌ఖండ్ ప్రాజెక్టు ముగించడానికి 10 కోట్లు కావాలి; తుఫాను వరదలవల్ల దెబ్బతిన్న నీటివసతులను చెరువులను బాగుచేయవలసి వున్నది. రామపాదసాగర్ నిర్మాణాన్ని వారు తప్పక ఎత్తుకుంటారు. జమీందార్లకు 8 కోట్లు పరిహారంఇవ్వాలి. అందులో 4 కోట్లు వెంటనే ఇచ్చుకోవాలి. ఇక పెన్నార్‌కు ముద్వతి, ఎగవపెన్నార్, భైరవవాని తిప్ప, గండికోట ప్రాజెక్టులు, కర్నూలు కడప నంద్యాల, తాడిపత్రి థర్మల్ స్కీములు కొన్ని మంజూరు అయినవి కొన్ని కావలసినవి వాటి గతిఏమికావలెనో వీటన్నిటిచేత, రాష్ట్రంవస్తే అనేక పనులు బాగా దెబ్బతినగలవు. సమిష్టిరాష్ట్రమైతే ఇవన్నీ సుష్టుగా సాగగలవని మా ధైర్యం. విభజన సంఘంవారి యెదుట వచ్చిన ఆర్థిక, పరిపాలనా సమస్యలు చాలా ప్రబలంగా వున్నవి. విభజన ఫలితాలు రాయలసీమకు వినాశకరము కాగలవు మా భవిష్యత్తంతా అంధకారమయమూ తుంది. కోరుగల సర్కార్ ఆంధ్రులను తృప్తిపరచడానికి రాయలసీమ జిల్లాలవారిని ఈ ప్రూరబాధలకు గురిచేయడం చాలా అనుచితం, అన్యాయం. అందుచేత రాయలసీమను ఆంధ్రరాష్ట్రంలో చేర్చవద్దని కోరుతున్నాము.

ప్రధాని కుమారస్వామి రాజాగారు ఈ విన్నపాన్ని సావధానంగా ఆలించారు.

### స్థాయిసంఘ సమావేశం

మదరాసు, డిసెంబరు 19: రాయలసీమ మహాసభ స్థాయిసంఘంవారు నిన్న సి. ఎన్. నరసింహారెడ్డిగారి అధ్యక్షతను సమావేశమయి, ఆంధ్రరాష్ట్రం వెంటనే యేర్పాటు చేయరాదని కోరుచు, ప్రధాన మంత్రిగారివద్దకు నేడు రాయబారం వెడలుటకు నిశ్చయించి, వారికి దాఖలు చేయవలసిన విన్నపమును సభలో ఆమోదించిరి ఆంధ్రరాష్ట్రం తిరిగి ఎన్నికలు జరిగేవరకు నిర్మింపరాదనియు, యీలోగా నిర్మింపవలసియుంటే, యీవిషయమయి రాయలసీమలో ఉపయెన్నికలు జరిపిన తరువాత నిర్మించవలెననియు ఇండియా ప్రభుత్వమును కోరుచు తీర్మానించిరి.

# 'వ్యవసాయదార్లస్థితిని చక్కచేయుటకు శాయశక్తులా ప్రయత్నిస్తాం'

## రాష్ట్రఆహారశాఖామంత్రి రోష్‌విక్టోరియా హామీ

నంద్యాల, డిశంబరు 17: వ్యవసాయదార్లస్థితిని బాగుపర్చుటకు రాష్ట్రప్రభుత్వమువారు తమకు సాధ్యమైనంతవరకు కృషిచేయగలరనియు, వీరిపరిస్థితి బాగుపరచుటద్వారానే ఆహారధాన్యాభివృద్ధి కల్గగలదనియు మద్రాసుప్రభుత్వపు ఆహారశాఖామంత్రియగు జే. యల్ పి రోచ్ విక్టోరియాగారు మంగళవారం సాయంత్రమున యిచట బహిరంగసభలో వుపన్యసించుతూ చెప్పిరి. పట్టణకాంగ్రెసు సంఘము యాజమాన్యాన యీ బహిరంగ సభ పీపుల్సు అసోసియేషన్‌నందు ఏర్పాటు చేయబడింది.

పట్టణకాంగ్రెసు సంఘము తరఫున అధ్యక్షులగు గుండం వెంకటరెడ్డిగారు మంత్రిగారికి ఒకనివేదికను సమర్పించిరి. ఈ జిల్లాయందు వరిచాలాతక్కువగా పండుచున్నందున వడ్లసేకరణను మానివేయవలసినదనియు, జొన్నలుజిల్లాయందు అధికముగా పండుచున్నందున జిల్లాయందు జొన్నలరవాణాపై యెట్టినిషేధములులేకుండా తొలగింపవలసినదనియు ధాన్యరూపమున కూలినొసంగుపల్లె ప్రదేశములందు 'యిన్‌ఫార్మల్' రేషనింగును రద్దుగావించవలసినదనియు కోరిరి. యీ జిల్లాయందు వుత్పత్తియగు వేరుశనగచెక్క ఈ జిల్లాయందు వ్యవసాయమునకు సరిపోవుననియు, దానిని యితరప్రాంతములకు యెగుమతిచేయుచుండుటచే ఈ జిల్లావ్యవసాయదార్లకు తగినంత లభించుటలేదనియు, అందుచేత జిల్లానుండి వేరుశనగ చెక్కయెగుమతిని నిషేధించవలసిందనియు కోరిరి. వ్యవసాయపనిముట్లుకు గాను కావలసిన యినుమును సహకారసంస్థలద్వారా సరఫరాచేయించవలసినదనియు, అడవులనుండి యెరువుగా పనికివచ్చు పచ్చిఆకును రైతులువుచితముగా తెచ్చుకొనుటకు అనుమతించవలసినదనియు కోరిరి. యిక్కడి రేషనుడిపోలందు యిక్కడవిక్రయించబడుచున్న చక్కెర తడిసియుంటున్నదనియు తూకము తక్కువచేయుటకై యిచటి చక్కెరవ్యాపారులు చక్కెరపైనీటినిచల్లి విక్రయించుచుండిరనియు, ఆ విషయమున తగుచర్యలు తీసుకోవలసిందనియు కోరిరి

రోచ్ విక్టోరియాగారు వుపన్యసించుచూ, జొన్నలరవాణా యిబ్బందుల విషయమై యింతవరకుండే తమకు తెల్పబడినదనియు, తరుగు ప్రాంతములకు కావలసిన పరిమాణమును సేకరించినపిమ్మట, యీ జిల్లాయందు జొన్నలరవాణా విషయమునగల నిషేధములన్నియును తొలగింపబడగలవనియు చెప్పిరి. ప్రభుత్వమువారు ఎంత ప్రయత్నించినను ఆహారధాన్యము సరఫరా విషయమున ప్రజలకు సంపూర్ణముగా తృప్తిని చేకూర్చజాల కున్నారని యూ, అందుచే ప్రస్తుతము వడ్లసేకరణను నిల్పివేయుట వుచితముగాదనియు అనిరి. వ్యవసాయ పనిముట్లకు ఇనుము ప్రస్తుతము మనదేశమున తగినంత లేదనియు, సరఫరా యెక్కువైనవెంటనే రైతులకు యెక్కువగా సరఫరా జేయుదుమనియు చెప్పిరి

వేరుసెనగచెక్క ఎగుమతి అపుటను గూర్చి భారతప్రభుత్వము వారితో సంప్రదించుచున్నదనిరి. ప్రజలు తమ యిబ్బందులనెల్లను అధికార్ల దృష్టికి గొనిదేనలసినదనియు, వాటిని నివారించ శక్తివంచనలేకుండా అధికార్లును, మంత్రివర్గము కృషిచేయగలదని చెప్పిరి.

అనంతరం రోచ్ విక్టోరియాగారు కలెక్టరుగారితోను నివర్తి వెంకటసుబ్బయ్య ఎం. ఎల్. ఎ. గారితోను, జిల్లాకాంగ్రెసు అధ్యక్ష కార్యదర్శులతోనుకలసి ఆళ్లగడ్డకు వెళ్లిరి. డా॥ యం. జే. సామ్యుయల్ ఎం. ఎల్. ఎ. గారు మంగళవారం రాత్రి విందొసంగి మంత్రిగారిని గౌరవించిరి. (స్వ. వి)

### కృష్ణానది నీటిమట్టం

మద్రాసు, డిసెంబరు 18: కృష్ణానది నీటిమట్టం నేడు విజయవాడ అనకట్టపై 6.2 అడుగులున్నది.

# దుమ్ముగూడెం గేదెల కేసుపై తీర్పు

## నలుగురు నిందితులకు కఠిన శిక్షలు

భద్రాచలం, డిసెంబర్ 15: "శాంతి, భద్రతలను రక్షింపవలసిన పోలీసులే అక్రమ ప్రవర్తనకు దిగినప్పుడు, అలాంటివారిని కఠినంగా శిక్షించి పోలీసు శాఖలోని దుర్నీతిపరులకు గుణపాఠం గరపవలసి వుంటుంద"ని భద్రాచలం తాలూకా మాజిస్ట్రేటు శ్రీ శైలంగారు దుమ్ముగూడెం గేదెల కేసులో ఈ నెల 7వ తేదీన తీర్పు చెబుతూ అన్నారు.

ఈ కేసులో ఒక పోలీసు హెడ్ కానిస్టేబిలు, ఒక వర్తకుడు, మరి ఇద్దరు నిందితులు. హెడ్ కానిస్టేబిలు ఎల్. రాజారావుకు 4 నెలలు, వర్తకుడు తమ్మన సత్యనారాయణకు 6 నెలలు బి పాపారావుకు 2 నెలలు, పి. జగ్గయ్యకు 6 నెలలు కఠినశిక్ష విధింపబడింది.

ఏజెన్సీలోని కొండజాతి వారిపట్ల అన్యాయం, అవమానం జరిగినప్పుడు కఠిన చర్యలు తీసుకోక తప్పదని, లేకపోతే కొండజాతి ప్రజల అభివృద్ధికి ఆటంకం కలుగుతుందని మాజిస్ట్రేటు అన్నారు.

ప్రాసిక్యూషన్ కథనం ప్రకారం, రెండవముద్దాయి తన ఎద్దు ఒకటి పోగా, ప్రక్కగ్రామంలోని ఒక కోయవాన్ని అనుమానించి మొదటిముద్దాయి సహాయం కోరాడు. మొదటి, రెండవ ముద్దాయిలు కలిసి కోయవానిని పోలీసుస్టేషనులో అక్రమంగా నిర్బంధించి, హింసించారు. మూడవ, నాలుగవ ముద్దాయిలు వెళ్లి చట్టవిరుద్ధంగా, కోయవాని ఇంటినుండి రెండు గేదెలను లాక్కొనివచ్చారు. (స్వ. వి.





# విద్రోహచర్యలను ప్రేరేపించే కమ్యూనిస్టుపత్రాల స్వాధీనం

## విజయవాడలో కాలేజీవిద్యార్థిఅరెస్టు

విజయవాడ, డిసెంబరు 19: విద్రోహచర్యలను ప్రేరేపించే కమ్యూనిస్టు సారస్వతం కలిగియున్న టి భాస్కరరావు అనే స్థానిక కాలేజీ విద్యార్థిని గత సుక్రవారంరాత్రి పోలీసులు అరెస్టుచేశారు. దుర్గా అగ్రహారంలో అతని ఇంటిని సోదా చేయగా విద్రోహానికి పురికొల్పే ఎన్నో ప్రకటనలు, కరపత్రములు బయటపడినవి. కమ్యూనిస్టు చర్యలు ఏవిధంగా సాగాలో వివరంగా ఈ పత్రికలలో ఆదేశించబడింది.

కమ్యూనిస్టు పార్టీపైగల ప్రభుత్వ నిషేధాన్ని ధిక్కరించి రాష్ట్ర సంఘం, జిల్లా సంఘాలు, కార్యకర్తలు, బహిరంగంగా పనిచెయ్యాలి, లేకపోతే పార్టీ నైతికబలం సన్నగిలుతుందనీ ఈ పత్రాలలో ఆదేశించబడింది. పార్టీనుండి ఎవ్వరూ రాజీనామా యివ్వటానికి వీలు లేదు; కాని సామాన్య సభ్యులు పార్టీనుండి తప్పుకున్నట్టు ప్రకటించి, కాంగ్రెసులోకి మెల్లగా ప్రవేశించవచ్చు; కమ్యూనిస్టు పైడీలు రాజీనామాలీయరాదు. మేము సాంస్కృతికాభ్యుదయం కొఱకే పనిచేస్తున్నామని ప్రజలకు నచ్చచెప్పి, తమ అసలు చర్యలను మరుగుపర్చాలి; నాటకాలు వేసి, లైబ్రరీలు స్థాపించి, ఆవిధంగా ప్రజా హృదయాలను దోలుచుకుపోవాలి; ఇది చాలా మంచి పద్ధతి, అని యీ పత్రాల సారాంశం.

హైదరాబాదు, ఆంధ్ర, కేంద్రకమ్యూనిస్టు పార్టీలకు సంబంధించిన పత్రాలు, దేశంలోని ఆహార పరిస్థితిపై పార్టీవ్యాఖ్యానాలుకూడా పోలీసులు స్వాధీనపరుచుకున్నారు. హైదరాబాదు కమ్యూనిస్టు పార్టీ గ్రంథం ఒకటి 132 పేజీలున్నది ఇందులో ఆదేశించబడిన ప్రకారం పార్టీవారు ముందువెనుక ఆలోచనలేకుండా, వెనుకంజవెయ్యకుండా విజృంభించాలట.

కమ్యూనిస్టు సారస్వతం కలిగిన బోడిపూడి రాధాకృష్ణమూర్తి అనే మరొక దుర్గాగ్రహార నివాసినికూడా పోలీసులరెస్టుచేశారు. (స్వ. వి.)

# ప్రభుత్వాన్నివిమర్శించుతూకూర్చోక బాధ్యతవహించి పనిచెయ్యాలి

## పల్లిపట్టు తాలూకా జమీన్‌రైతు సభలో ఎ౯. పి. చెంగల్రాయనాయుడుగారి ఉద్బోధ

నగరి, డిసెంబరు 18: పల్లిపట్టు తాలూకా జమీన్ రైతు మహాసభ నిన్న, కతెరపల్లె గ్రామంలో జిల్లాబోర్డు సభ్యులు మాదిరాజు సుబ్రహ్మణ్యంరాజుగారి అధ్యక్షతను జరిగింది. సభను జిల్లాబోర్డు అధ్యక్షులు ఎన్. పి. చెంగల్రాయనాయుడుగారు ప్రారంభించారు. బోర్డు సభ్యులు కే. ఆర్. కుమారస్వామిశెట్టిగారు పతాకోత్సవం జరిపారు.

జిల్లాబోర్డు అధ్యక్షులు కత్తెరపల్లె గ్రామస్థులు యిచ్చిన సన్మాన పత్రానికి సమాధాన మొసగుతూ, ఇచ్చట జమీన్ రైతుల యిబ్బందులకు విచారం వెలిబుచ్చి, ప్రతి గ్రామంలోను రైతు సంఘాలు ఏర్పరిచి, రైతుల కష్టాలను ప్రభుత్వానికి అందజేసి, తగురీతిన సౌకర్యములు కల్పించుటకు యువకులు ముందంజ వేయవలయునని కోరారు. "ఇచ్చటి శిరువాలు తగ్గించుటకు మీరు తీవ్ర ఆందోళన చేయవలసియున్నది. ప్రభుత్వాన్ని విమర్శిస్తూ కూర్చొని వున్న లాభంలేదు. అందరు బాధ్యతవహించి ప్రభుత్వంతో సహకరించి పని చేయాలి, అని, యుకూడ ఒక్కొమ్మడిగా జరగాలంటే సాధ్యపడని పని, విధానం మీద అన్నియు చక్కబడగలవు. ఈ మాప్రాంతంలోపల జమీందారి రద్దు చట్టం అమలు జరపాలని ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయాలి" అని చెంగల్రాయనాయుడుగారన్నారు. రైతులు చైతన్యవంతులై రాబోవు ఎన్నికలలో ఉత్సాహం జూపి, దేశంలో రైతు ప్రజారాజ్యం స్థాపించవలెనన్నారు ప్రతి రైతు ఆహార ధాన్యాలను అధికంగా పండించి, ప్రస్తుతం ఏర్పడి వున్న ఆహార కొరతను తీర్చుటకు ప్రతిజ్ఞ బూనవలెనన్నారు. రైతులకు కావలసిన సౌకర్యాలు చేయబడుననీ, ఈ గ్రామంలో ఒక వైద్యశాలను మాత్రం నిర్మించమనీ, గ్రామానికి రోడ్డు మాత్రం గ్రామస్థులే వేసుకోవలెననీ అన్నారు.

సభాధ్యక్షులు మాదిరాజు సుబ్రహ్మణ్యం రాజుగారు మాట్లాడుతూ, యీ ప్రాంతంలోని జమీన్ రైతుల కష్టాలను వివరించారు. ఈ గ్రామానికి రైతులే స్వయం కృషితో రోడ్డు నిర్మించుకొనుటకు బూనుకొనవలయునన్నారు.

ఈతాలూకాలోని ధాన్యశిస్తుల గ్రామదులలో ప్రభుత్వశిస్తు తగ్గింపు విషయంలో రైతులకు చాల అన్యాయం కలిగినందున ప్రభుత్వమువారికి నివేదించి, న్యాయం కలుగజేయుటకు అన్నివిధములైన ప్రయత్నములు తీసికొని పనిచేయుటకు సభవారు కార్యనిర్వాహక వర్గమునకు అధికారమిస్తూ తీర్మానించారు. ధాన్యశిస్తుల విషయమై ప్రభుత్వమువారిచే తుది నిర్ణయమగువరకు ధాన్యశిస్తుల గ్రామదులలో శిస్తులవసూళ్లు ఆపుదలచేయవలసినట్లు ప్రభుత్వమును కోరుతూ తీర్మానించమైనది. ప్రభుత్వంవారు రైతులవద్ద నిర్బంధ ఋణాలు వసూలు చేయదలచిన పద్ధతి చాల అన్యాయమని, దీనిని వీరూపంలోగాని అమలుపరచగూడదనికోరారు.

తాలూకాలో చెరువుల మరమ్మత్తులు తక్షణం చేయించాలనీ, మరమ్మత్తుల కగు ఖర్చులు ప్రభుత్వం జమీందార్లకిచ్చు పరిహారంలోనుండి పట్టి భరించవలెననీ, రైతులవద్దనుండి ఏమాత్రం కోరగూడదనీ, ప్రభుత్వమునుకోరారు. ఈతాలూకాలోని పల్లిపట్టు, కార్వేటినగర గ్రామాలలో వ్యవసాయడిపోలుపెట్టి ఎరువులు, వ్యవసాయ పనిముట్లు అమ్మించవలయునని కోరారు.

కురికల మిట్టనుండి, కత్తెరపల్లె ఉద్దమలకుడితి గ్రామాలమీదుగా దేవలంపేట వరకు రోడ్డు వేయించవలెనని జిల్లాబోర్డు వారిని కోరారు.

తర్వాత పల్లిపట్టు తాలూకా జమీన్ రైతు సంఘ కార్యనిర్వాహకుల ఎన్నికలుజరిగి, ఎస్. సుబ్రహ్మణ్యం రాజుగారిని అధ్యక్షులుగను, ఎ. దేవరాజులు, సి. చెంగారెడ్డి, పి. పార్థసారథి శెట్టిగార్లను కార్యదర్శులుగను మరి యిరవైమంది కార్యవర్గ సభ్యులను ఎన్నుకొన్నారు, లక్ష్మీనారాయణయ్యగారి అభివందనములతో సభ ముగిసెను. (స్వ. వి.)

### బనగానపల్లె తాలూకా గ్రామోద్యోగుల సంఘ సమావేశం

బనగానిపల్లె, డిసెంబరు 16: బనగానిపల్లె తాలూకా గ్రామోద్యోగుల సంఘ సర్వసభ్య సమావేశము కానాలరెడ్డి వెంకటరెడ్డిగారి అధ్యక్షతను యిక్కడ మొన్న జరిగినది. ప్రత్యేక ఆహ్వానముపై పెండేకంటి వెంకటసుబ్బయ్య ఎం. ఎల్. ఎ. సత్యనారాయణ (తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు) స్వామీ హంసానంద సరస్వతిగారు హాజరైరి.

కర్నూలుజిల్లా కలెక్టరుగారు సబ్ తాలూకాలోని వివిధ గ్రామములను గ్రూపులుగాచేస్తు జారీచేసిన వుత్తరువును నిరసిస్తూ తీర్మానంచేశారు. ఈ గ్రూపులు చేసిన ఫలితముగా అనేక గ్రామోద్యోగులు తరతరములుగా అనుభవించుచున్న వంశపారంపర్యపు హక్కులు పోగొట్టుకొనవలసిన వారగుచున్నారనీ, అదియునుగాక పరిసర యూనియన్ తాలూకాలలోని గ్రామాలకు వర్తింపచేసిన చట్టమును ఈతాలూకాకు వర్తింపజేయకుండా ప్రత్యేకముగా తాలూకా గ్రామములకు మాత్రమే యీ గ్రూపులపద్ధతిని వర్తింపజేయడము చాలా అన్యాయమనీ, కావున ప్రభుత్వమువారు యీ వుత్తరువును వెంటనే రద్దుచేయవలయునని కోరారు, ఈవిషయమునుగురించి ప్రభుత్వముతో సంప్రదించుటకు పెండేకంటి వెంకటసుబ్బయ్య జే. సత్యనారాయణ, స్వామి హంసానంద సరస్వతి, ఎ. సత్యనారాయణరావు, వి. చెన్నారెడ్డిగార్లతో ఒక రాయబార వర్గమును ఏర్పాటుచేశారు.

## గంటల పంచాంగం

విరోధి సం॥ పుష్య శు॥ ద్వితీయ

1949సం॥ డిసెం॥ 21 బుధవారం

బు॥ ద్వితీయ రా 8.24 పూషా ప2-9 వర్జ్యం రా 9-55 ల 11-29 వ.

శు॥ తృతీయ డిసెం॥ 22 గురువారం

గు॥ తృతీయ సా 7.19 ఉషా ప 1.30 వర్జ్యం సా 5.31 ల 7-8 వ.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ పుష్య శు॥ ద్వితీయ

బుధవారం

## ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి అవరోధములు

ఆంధ్రరాష్ట్రము 1950 జనవరి 26 వ తేదీన ఏర్పడకపోయిన అందుకు కేంద్రప్రభుత్వమే కారణమగునని అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శి, విభజనసంఘసభ్యుడు శ్రీ కళా వెంకట్రావుగారు గతవారము విజయవాడనుండి చేసిన ప్రకటన యధార్థమును పూర్తిగ వెల్లడించలేదని, స్థలాంతరమున నేటిపత్రికలో ప్రకటితమైన మా న్యూఢిల్లీ విలేఖరి వార్తానివేదిక స్పష్టముచేయుచున్నది. రాష్ట్రనిర్మాణమునకు పూర్వము స్థిరపడవలసిన అనేక వ్యవహారములు 1950 జనవరి 26 కు కాక, 1950 ఏప్రిల్ 1 వ తేదీకి పూర్తియగుట సాధ్యమని చెన్నరాష్ట్ర మంత్రివర్గము, డిసెంబరు 6 వ తేదీన తీర్మానించి, అదె తమ నిశ్చితాభిప్రాయముగ కేంద్రప్రభుత్వమునకు తెలిపియుండెను. ఈ యభిప్రాయము తమ సంకల్పమునకు అనుగుణముగ నున్నది గదా యని కేంద్ర ప్రభుత్వము వారు 1950 ఏప్రిల్ 1 ఆంధ్ర రాష్ట్ర స్థాపన ముహూర్తమని తీర్మానించుకొని ఆ ప్రకారమే కార్యక్రమమును కొనసాగించుచున్నట్లు హోంశాఖా కార్యదర్శి ఇటీవల అనగా విభజన సంఘ నిర్ణయమును గమనించిన మీదట, చెన్నరాష్ట్ర ప్రభుత్వమునకు వ్రాసిన లేఖనుబట్టి స్పష్టమగుచున్నది. చెన్నరాష్ట్రప్రభుత్వము విభజన సంఘ నిర్ణయముల ననుసరించి డిసెంబరు 6 వ తేదీ యభిప్రాయమును మార్చుకొనియుండలేదని, ఇప్పటికి 1950 ఏప్రిల్ 1వ తేదీనాటికే ఆంధ్రరాష్ట్రనిర్మాణ సందర్భమున తీసుకొనవలసియున్న యావత్తు చర్యలు పూర్తికావచ్చునని అభిప్రాయపడుచున్నట్లు చెన్నరాష్ట్ర ప్రభుత్వమువారు కేంద్రప్రభుత్వమునకు డిసెంబరు 10 వ తేదీ వ్రాసిన లేఖవలన స్పష్టమగుచున్నది.

వీటినిబట్టి కేంద్రప్రభుత్వము ఏ కారణమునుబట్టియైనను తన యభిప్రాయమును మార్చుకొని, జనవరి 26 లోపుననే ప్రాతిపదిక చర్యలను ముగించుటకు ప్రయత్నింపవలసినదని కోరినప్పటికిని చెన్నరాష్ట్ర ప్రభుత్వము తన పూర్వనిర్ణయమును మార్చుకొని విభజన కార్యక్రమమును శీఘ్రముగ ముగించునను విశ్వాసము ఏర్పడుటకు రాష్ట్రప్రధాని ప్రకటనలుగాని, డిసెంబరు 10 వ తేదీన కేంద్రప్రభుత్వమునకు రాష్ట్రప్రభుత్వము వ్రాసిన లేఖగాని ఆధారమగుటలేదు.

కేంద్రప్రభుత్వ హోంశాఖా కార్యదర్శి నవంబరు 25 వ తేదీన, తిరిగి ఈ మాస మధ్యలో చెన్నరాష్ట్ర ప్రభుత్వమునకు వ్రాసిన లేఖలు సులభముగ పరిష్కారము కాగల స్వల్పసమస్యలను పరిష్కారమునకు లొంగని బ్రహ్మాండమైనసమస్యలుగ చిత్రించుటనుబట్టి కేంద్రప్రభుత్వమునకు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయమున అంత ఆసక్తిలేదను భావము కలుగగలదు. కేంద్ర ప్రభుత్వ నిర్ణయమునకు చెన్న రాష్ట్ర ప్రభుత్వ వైఖరికొంత వరకు కారణమగుచున్నదని చెప్పవలసియున్నది. థార్ కమిషన్ వారు నూత్న ఆంధ్ర రాష్ట్రమునకు ఏటా 6½ లక్షల రూపాయిల లోటు రాగలదని తెలిపిన అభిప్రాయమును హెచ్. వి. ఆర్. అయ్యంగార్ నవంబరు 25 వ తేదీ లేఖయందు విశేష ప్రాధాన్యమిచ్చి తెలిపియుండ, అందుకు సమాధానముగ డిసెంబరు 6 వ తేదీన చెన్న రాష్ట్ర ప్రభుత్వమిచ్చిన సమాధానమున ఆర్థిక మంత్రి ఇటీవల రాష్ట్ర శాసన సభలో వెల్లడించిన వివరముల నైన తెలిపియుండవలసినది. అట్లు చేయకపోవుటవలన 6½ కోట్ల రూపాయిల లోటుతో ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమునకు కేంద్రప్రభుత్వము తక్షణ చర్యలు తీసుకొనుటకు సందేహించుచున్నది. ఆర్థిక మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు నవంబరు 10 వ తేదీన రాష్ట్ర అసెంబ్లీలో వెల్లడించిన వివరములనుబట్టి ఆంధ్రరాష్ట్రమునకు మూడుకోట్ల రూపాయిల లోటు మాత్రమేయుండునని స్పష్టమైనది. ఇందుగవర్నరు, హైకోర్టు, ప్రభుత్వ కేంద్రస్థానము మున్నగువాటి కగు ఖర్చు చేర్చనందువలన లోటు తక్కువగ కన్పించినదని వాదింప వచ్చును. అట్లే కేంద్రప్రభుత్వము నుండి రాగల పోగాకు, ఆదాయపు పన్ను మొత్తములను ఆదాయమునందు చేర్చియుండలేదు.

అదేవిధముగ బళ్లారిజిల్లాయందలి ఆంధ్రేతర తాలూకాల విషయమునను చెన్న రాష్ట్ర ప్రభుత్వము కేవలము విభజన సంఘ అభిప్రాయమును నివేదించుటతో తృప్తిచెందియుండక, ఆ తాలూకాలపై పరిపాలనాధికారము తమకే యుండునని, ఆ పరిపాలనా నిర్వహణకు అవసరమగు సదుపాయములను గురించి నూత్న ఆంధ్రప్రభుత్వముతో ఒడంబడిక కుదుర్చుకొనగలమని తెలిపియున్న కేంద్రప్రభుత్వమువారు తమ ఇటీవలి లేఖయందు ఈఆరుతాలూకాల భవిష్యత్తు నిర్ధారణ కాకున్న ఆంధ్రరాష్ట్రనిర్మాణమే సాధ్యము గాదని వాదించియుండెడివారు గాదు.

కేంద్ర - రాష్ట్రప్రభుత్వముల వైఖరిని పరిశీలించినమీదట జనవరి 26 లోపున ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగదని స్పష్టమగుటయేగాక, 1950 ఏప్రిల్ 1 వ తేదీకైనను రాష్ట్రము ఏర్పడుట సందేహామే యని వెల్లడియగుచున్నది. ఆంధ్రరాష్ట్ర ఆర్థికస్థితి తృప్తికరముగ నుండునని, బళ్లారి జిల్లాలోని 6 తాలూకాల భవిష్యత్తు కేంద్రప్రభుత్వాభిమతము ప్రకారము నిర్ధారణ కాగలదని చెన్నరాష్ట్రప్రభుత్వమూ ఇప్పటికైన స్పష్టముచేసిన ఆంధ్రరాష్ట్ర స్థాపనకు గల అవరోధములు తొలగి వెంటనే రాష్ట్రమేర్పడగలదు.

## చక్కెర పరిస్థితిపై ప్రభుత్వ ప్రకటన

### కొరత ఏర్పడుటకు కారణాల వివరణ

న్యూఢిల్లీ, డిశంబర్ 19: లోగడ ప్రధానమంత్రి చేసిన వాగ్దానాన్ని అనుసరించి, పార్లమెంటు సభ్యుల కందరకూ, యీ వేళ, దేశంలోని పంచదార పరిస్థితిని వివరించుతూ ఒక ప్రకటనను అందజేశారు. ఇదికాక దేశంలోని పంచదార పరిస్థితిని తెలుసుకోవటానికీ, అవసరమైన చర్యలను గురించి ఆలోచించటానికీ ఉపప్రధాని సర్దార్ వల్లభాయ్ పటేలు రేపు ఉదయం రాష్ట్ర, సంస్థాన మంత్రులను కలుసుకుని సంప్రదించబోతున్నారు.

ప్రభుత్వం సభ్యులకు అందజేసిన ప్రకటనలో ఈ దిగువ వివరాలు తెలియజేశారు:

'దేశంలో పంచదార కొరత యేర్పడటానికి గల ముఖ్యకారణాలు: (1) జనాభా పెరుగుదల, (2) జీవనపరిణామం వృద్ధి కావటంవల్ల పంచదార వినియమం పెరగటం, (3) కడచిన సంవత్సరం రు 35 ధరలో వున్న మణుగు పంచదార ఖరీదూ, ఈ సంవత్సరం రు. 28-8-0 కు దిగకగా లభించటంవల్ల పంచదారవాడకం పెరగటం (4) బెల్లం ధర పెరగటం కారణంగా పూర్వం బెల్లం ఉపయోగించేవారు కూడా పంచదారను వినియోగించటానికి పూనుకోవటం.

1947-48 ఉత్పత్తులో 1.75 లక్షల టన్నుల పంచదార మిగిలింది. 1948-49 ఉత్పత్తి 10.25 లక్షల టన్నులు. మొత్తం 12 లక్షల టన్నులు పంపకం జరిగింది. కాని డిశంబర్ నుంచి, జూన్‌వరకూ గల 7 మాసాలలోనూ ప్రజలు నెల 1-కి సగటున, 1,10,000 టన్నులు వినిమయం చేశారు. అంటే మొత్తం 13 లక్షల టన్నులు కావలసి వచ్చింది. యధా ప్రకారం నెలకి 1 లక్ష టన్నుల చొప్పున అమ్మకం జరిగితే సరిపోయేది.

మొదటి 7 మాసాల్లోనూ జరిగిన వినిమయాన్ని గుర్తించి పారిశ్రామికులు మిగులేమీవుండదని తెలుసుకోవలసింది. పరిస్థితి ఇలావుండగా పారిశ్రామికులు 50,000 టన్నుల పంచదార నుపాకిస్థాన్ కు ఎగుమతి చేయటానికి అనుమతి నివ్వవలసిందిగా కోరారు ఇందుకు ప్రభుత్వం అంగీకరించింది. దీనికి తోడు, 'షుగర్ సిండికేట్' వారు, జూలైలో ఫ్యాక్టరీలు ఉత్పత్తిచేసిన సరుకులో నూటికి 90 పాళ్లు అప్పటికే ఖర్చయిపోయినట్టు ప్రకటించారు. దాంతో స్పెక్యులేషన్ కొనుగోళ్లు ప్రారంభమైనై; ధరలు విపరీతంగా పెరిగినై.

బీహారు మన్మథపరగణాల ఫ్యాక్టరీలు ఒక్క జూలై మాసంలో 98,528 టన్నుల పంచదారను, 'షుగర్ సిండికేట్' నిర్ణయించిన ధరమీద 6, 7 రూపాయలు ఆదనంగా వేసుకుని అమ్మివేసినై. కడచిన సంవత్సరం జూలైమాసంలో ఆ ఫ్యాక్టరీల మొత్తం అమ్మకాలన్నీ కలిసి 66,127 టన్నులకంటే లేవు.

పరిస్థితి విషమించటంచూచి ప్రభుత్వం ఆగస్టు 16, 18 తేదీలలో పంచదార పారిశ్రామికులను పిలిపించి, ఈ పరిస్థితిని ఎదుర్కోవటానికి తీసుకోవలసిన చర్యలేమిటి అని ఆలోచించింది.

జూలైలో 'షుగర్ సిండికేట్' మొత్తం 1,21,423 టన్నుల సరుకు విడుదలచేసింది. క్రితం సంవత్సరం ఇదేమాసంలో విడుదలైంది. 88,042 టన్నులు మాత్రమే.

ఆగస్టు 21 వ తేదీన ప్రాయా సలహా సంఘంతో ఆలోచించి, వ్యవసాయ శాఖా మంత్రివర్గం కొన్ని ప్రతిపాదనలు తయారుచేసి, 23 వ తేదీన ఆర్థిక సలహా సంఘం ఎదుట అందజేశారు. సరకు నిల్వలను స్తంభింపచేయాలనే ఉద్దేశం ప్రభుత్వానికి అప్పట్లోలేదు. 'సిండికేటు' అంగీకరించిన ధరను మాత్రం అనుమంజరిపాం. దీన్ని ఉల్లంఘించిన వారినుంచి నిల్వలు స్వాధీనం చేసుకోవలసిందిగా రాష్ట్రప్రభుత్వాలకు విధికారమిచ్చాం. 50 వేల టన్నుల పంచదారను బయటినుంచి తెప్పించాలని ఒక సూచనవచ్చింది విదేశ చలామణీ అభావంవల్ల ఆ సూచన త్రోసి వేశాం. ఈ విషయాలపై తమ తమ అభిప్రాయాలు తెలుపవలసిందిగా కోరుతూ రాష్ట్ర ప్రభుత్వాలకు యీ సూచనలు 25 వ తేదీన అందజేశాం. సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వం 27 వ తేదీన పంచదార నిల్వలను స్తంభింపచేస్తూ ఒక ప్రకటన చేసింది.

ఆగస్టు 30 వ తేదీన సమావేశమై, రాష్ట్రప్రభుత్వాల అభిప్రాయాలను, దేశంలోని పరిస్థితులనూ ఆలోచించి దేశంమొత్తంమీద సరకునంతా స్తంభింపజేయటానికి నిర్ణయించింది.

సరకులు స్వాధీనం చేసుకోవటానికి, ప్రజను పంపకాలు చేయటానికి ఒకవాగం ఏర్పాటిపటించి మొదటిదఫా, వివిధ రాష్ట్రాలకూ 1,20,000 టన్నులు విడుదల చేశాం. దీనితో డిసెంబరు 15 వ తేదీ వరకూ సద్దుకోవలసిందిగా రాష్ట్రాలకు తెలియజేశాం. ప్రభుత్వం సేరు 1 కి 0-12-0 చొప్పున నిర్ణయించి, అమ్ముతున్నది. ఇతరత్రా వ్యాపారస్తులు, దొంగతనంగా అమ్ముతున్న ధర సేరు రు. 2/- వరకూ వున్నట్టు తెలుస్తున్నది.

ఉత్పత్తులు పెంచటానికి తీసుకున్న చర్యలు -

(1) 1948-49 ఉత్పత్తులను మించి పనిచేయగల సంస్థలకు ఎక్సయిజు పన్ను మొత్తంగా రద్దుచేయటం.

(2) చెరుకుమీదపన్ను సగానికి సగం తగ్గించటానికి సంయుక్త రాష్ట్రాల నిర్ణయం.

(3) ఫ్యాక్టరీలు వెంటనే పని ప్రారంభించవలసిందిగా సిఫారసు చెయ్యటం.

"ప్రజలు ఈ విషయంలోపడ్డ యిబ్బందులన్నీ ప్రభుత్వానికి తెలుసు. పరిస్థితిని చక్కబరచటానికి ప్రభుత్వం తీవ్రమైన కార్యక్రమం అమలు జరపటానికీ, ఉత్పత్తులు పెంచటానికీ ప్రయత్నించుతున్నది. అని ఆ ప్రకటనలో తెలియజేశారు.

పంచదార విషయమై చర్చ డిసెంబరు 23 వ తేదీన గాని, 24 వ తేదీనగాని జరుగుతుందని అధ్యక్షులు ప్రకటించారు.

## రాష్ట్రమంత్రులతో సర్దార్ పటేల్ చర్చలు

న్యూఢిల్లీ, డిశంబరు 19: పంచదార కరువును గూర్చి చర్చించే నిమిత్తం యు. పి. ప్రధాని, తక్కిన రాష్ట్రాల ఆహార మంత్రులు, భారత ప్రధానిని, ఉప ప్రధానిని, ఆహార మంత్రిని, ఆర్థిక మంత్రిని కలుసుకున్నట్లు తెలుస్తున్నది. తమ తమ రాష్ట్రాలలో పంచదార సరఫరా, దాని ఖరీదు, ఉత్పత్తి మొదలైన విషయాలనన్నింటిని వారికి నివేదించారనీ, తమ అనుభవాన్ని పురస్కరించుకొని కొన్ని సూచనలు గూడా చేశారని గూడా తెలియవస్తున్నది.

పంచదార ఉత్పత్తి ఆ యా రాష్ట్రాలలో ఎక్కువ కావాలంటే చెరకుపంట అభివృద్ధి అయ్యే నిమిత్తం రైతులకు రేమిపన్ ఇప్పిస్తే బాగుంటుందని వీరు చేసిన సూచనలలో ఒకటి.

కొత్తగా పండిన పంటకు రెమిషన్ ఇప్పించే ఏర్పాటు యు. పి. లో అప్పుడే ప్రకటించటమైనా బొంబాయి ప్రభుత్వం గూడా ఈ విషయాన్ని ఆలోచిస్తున్నదని తెలుస్తున్నది.

వీరు చేసిన సూచనలను కేంద్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

# "హిందూ ప్రజాబాహుళ్య మంతటికీ ఏకైకస్మృతి"

## క్రోడీకరణ బిల్లు ఆవశ్యకత: పార్లమెంటులో అంబేద్కర్ వివరణ

న్యూఢిల్లీ, డిసెంబరు 19: "హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణబిల్లు వివాహం, దత్తత, సంరక్షక హక్కు, సమిష్టికుటుంబ ఆస్తి, స్త్రీల ఆస్తి, నిస్సంతు వారసత్వం, మరణశాసనానుసారమైన వారసత్వం, భరణం అన్న అంశాలమీద హిందూ స్మృతులన్నిటినీ క్రోడీకరించి, సవరించటానికై ఉద్దేశించబడినది. దీనిని సాధ్యమైనంత త్వరలో మనం ఆమోదించటం అవసరం. ఇప్పుడు దేశంలో భిన్న ప్రాంతాలలో ఉన్న హిందూ ప్రజలు భిన్నస్మృతులను అనుసరిస్తున్నారు. దేశమంతా ఏకం చేయబడుతున్నది కనుక ఈస్మృతులన్నీ సమన్వయించబడి ఏకైకస్మృతి ఒకటి తయారు కావటం ఎంతో అవసరం. ఈపనిని ఇంక ఎంతమాత్రమూ వాయిదా వేయకూడదు. అని భారత న్యాయశాఖమంత్రి డా॥ అంబేద్కర్ నేడు పార్లమెంటులో హిందూ ధర్మ శాస్త్ర క్రోడీకరణ బిల్లు ఆవశ్యకతను వివరిస్తూ హెచ్చరించారు.

స్థూలంగా బిల్లు ముఖ్యసూత్రాలు నెగ్గి తీరవలెనని ప్రభుత్వం సంకల్పించుకున్నప్పటికీ, ప్రతి అంశాన్నీ సమాధానపూర్వకంగా చర్చించటానికి సిద్ధంగా ఉన్నదని ప్రధాని నెహ్రూ సమావేశంలో వెల్లడించారు. సాధ్యమైనంత ఎక్కువమంది దీనిని ఆమోదించేట్లు చేసే నిమిత్తం పాత సెలక్టు కమిటీ సభ్యులతోనూ, ఆసక్తిగల పార్లమెంటు సభ్యులతోనూ, ఇతరులతోనూ సంప్రదిస్తామని ఆయన ప్రకటించాడు.

డా॥ అంబేద్కర్ ప్రసంగిస్తున్నప్పుడు అనేకసార్లు సభ్యులు తీవ్రంగా అడ్డు తగిలారు.

హిందూ ధర్మశాస్త్రాన్ని క్రోడీకరించటమన్న అంశానికి మాత్రమే పార్లమెంటు ఆమోదించినదని అధ్యక్షుడు మవ్లాంకర్ స్పష్టపరిచాడు.

పార్లమెంటులో ప్రశ్నోత్తర కాలము కాగానే హిందూ ధర్మక్రోడీకరణ చట్టపు సెలెక్టుకమిటీ నివేదికను యీ పార్లమెంటు పరిశీలించవలెనను తీర్మానము డా॥ బి. ఆర్. అంబేద్కరుగారు ప్రతిపాదించిరి. అంతట ప్రధాన మంత్రి నెహ్రూ హర్షధ్వనుల మధ్యలేచి యిట్లు చెప్పిరి. ఈ పార్లమెంటు సమావేశములోనే యీ చట్టము పూర్తిగా చర్చింపబడి ఆమోదింపబడగలదని మేము ఆశించితిమి. కాని, యీ చట్టనిబంధనల విషయములో అభిప్రాయభేదములు ఎక్కువగా నున్నందువల్లను యీ చట్ట నిబంధనలగూర్చి చాలామంది శ్రద్ధాశక్తులను వహించి పట్టుదలగా నున్నందువల్లను అనేక వివాదగ్రస్త నిబంధనల సందర్భములో ఎక్కువమందికి అంగీకార యోగ్యమైన పద్ధతిగా వాటిని సవరించుట యుక్తమని ఎంచితిమి. ఈ చట్టమునుగూర్చి యీ సమావేశములోను ఇంతకుపూర్వ సమావేశంలోను చాలా చర్చ జరిగింది. ఇతర ముఖ్యమైన చట్టములు అనేకం చర్చింపవలసినవి ఉండినప్పటికీ ఈ చట్టమును చర్చించుటకు మొదటిలో రెండుదినములు ప్రత్యేకించి నప్పటికీ, రెండుమార్లు ఆ గడువును పొడిగించితిమి. నేడుకూడా యీ చట్టపు చర్చకే వినియోగించవలసివచ్చింది.

ఈ చట్టమును గూర్చిన చర్చను నిరోధించవలెననే సంకల్పంమాకులేదు. ఈచట్టములో వివాదగ్రస్తాంగాలున్న నిబంధనల విషయములో సమాధానమునకు రావలెననే బుద్ధితో చర్చను సాగించేయొడల మంచిది. కేవలం స్వపక్ష అధికసంఖ్యాక వోట్లబలంతో యీ చట్టమును శాసించవలెనని ప్రభుత్వం సంకల్పంకాదు. ఈ బిల్లుయొక్క ముఖ్యసూత్రములను మాత్రము కట్టుబడియున్నది. కాని, ఆయా ప్రత్యేకనిబంధనల గూర్చిన భిన్నాభిప్రాయములను సమన్వయించవలెననేదే మా సంకల్పము. ఈ బిల్లుయొక్క యీ ప్రారంభఘట్టము ముగిసిననేతప్ప, దానిలోని వేర్వేరు నిబంధనలగూర్చి సభ్యులతో ఇష్టాగోష్ఠి చర్చలను జరుపుటకు వీలులేదు. ఇట్టి ఇష్టాగోష్ఠి చర్చలను జరుపుటయే ప్రస్తుతము ఉత్తమముగా నున్నది. కాని, దూషణ ప్రతిదూషణలతో కూడిన చర్చ యీ సమయంలో జరుపుట యుక్తముకాదు. ఈ బిల్లును ప్రతిపాదించిన న్యాయశాఖా మంత్రిగారే పాత సెలెక్టు కమిటీ సభ్యులతోను ఆసక్తిగల పార్లమెంటు సభ్యులతోను, ఇతరులతో ఇష్టాగోష్ఠిగా చర్చించగలరు.

మనలోమనముభిన్నాభిప్రాయులమైనప్పటికి అందరికిన తృప్తిపరచేటందుకు వీలుగా ఒకచట్టమును త్వరలో చేసేనిమిత్తమై మన సొంత సిద్ధాంతములనుకొంతవరకు వదలుకోవాలి ఇది ప్రజాప్రభుత్వపద్ధతి. ఆపద్ధతిలో మనం చర్చించాలి.

ఈ చట్టము ముఖ్యమైనదికాదని తలంచవద్దు. మన ఆర్థికాభివృద్ధికి సాంఘికాభివృద్ధికి ఈ చట్టంచాలా అవసరం. మనం ఆర్థికవ్యవహారాలలో సాంఘికవ్యవహారాలలో ముందంజవేయుటకు ఈ చట్టం కావాలి. రాజకీయస్వాతంత్ర్యం గడించాముకాని ఆర్థికంగా సాంఘికంగా ఇంకా వృద్ధిపొందాలి. మనదేశాభ్యుదయంకోసం ప్రజలను ముందంజ వేసేట్లుగా మనం నడిపించాలి.

ఈ అంశాన్ని మనసులో పెట్టుకున్నప్పుడు మనం ఇతరులను అనుసరించ ప్రయత్నించకూడదు. మిగిలిన వారిని కూడా మన మార్గానికి త్రిప్పి మనను అనుసరించేట్లు చేయవలెను అందువల్ల బిల్లును చర్చించాలన్న ప్రతిపాదనను ప్రస్తుతానికి ఆమోదిస్తే, ప్రభుత్వం అందరితోనూ సంప్రదించి, అధిక సంఖ్యాకులకు అంగీకారయోగ్యంగా చేయటానికి చర్యలు తీసుకుంటుంది. అని పండితనెహ్రూ ప్రసంగాన్ని ముగించగా సభ్యులు ఉత్సాహధ్వనులు చేశారు.

### ముగింపు తీర్మానం

పార్లమెంటరీ వ్యవహారాల మంత్రీ, ప్రభుత్వ చీఫ్ ఛప్పా అయిన సత్యనారాయణ్ సింహా చర్చను ముగించాలని ప్రతిపాదించాడు. బిల్లును క్లాజువారీగా చర్చించటంముందు జరగనున్నది కనుక దానిని అంగీకరిస్తున్నానని అధ్యక్షుడు మవ్లాంకర్ నిర్ణయించాడు

"బిల్లు ప్రతిపాదన నామోదించటంవల్ల బిల్లులోని ఏ అంశాన్ని యినా ఆమోదించినట్లవుతుందా?" అని మహావీర్ త్యాగి ప్రశ్నించగా, కేవలం హిందూధర్మశాస్త్ర క్రోడీకరణకు మాత్రమే పార్లమెంటు ఆమోదించినట్లని అధ్యక్షుడు స్పష్టీకరించాడు

డా॥ పంజాబ్ రావ్ దేశముఖ్ ప్రధాని నెహ్రూ ప్రతిపాదన (చర్చ ప్రతిపాదనకు వాయిదాకు అంగీకరించటం, అవసరమైన మార్పులు ప్రభుత్వం చేయించటం) ఉత్తమమైనదే కాని పార్లమెంటరీ పద్ధతికిభిన్నంగా ఉన్నదని అన్నాడు

### అంబేద్కర్ జవాబు

డా॥ అంబేద్కర్ చర్చకు జవాబివ్వటానికి లేచినప్పుడు అనేకమంది సభ్యులు ఆయన ప్రసంగానికి అడ్డు తగిలారు. ఆ విధంగా చేయవద్దని అధ్యక్షుడు హెచ్చరించవలసి వచ్చింది.

డా॥ అంబేద్కర్ తన జవాబు నీక్రింది విధంగా ప్రారంభించాడు:

"ఇంతవరకూ చర్చలో పాల్గొన్న 33 మందిలోనూ 23 మంది బిల్లుకు అనుకూలంగా ఉన్నారు. అందులో ఇద్దరు సవరింపుకు కొన్ని సవరణలు పెట్టారు మిగిలినవారిలో ముగ్గురు కటస్థంగా ఉన్నారు. ముగ్గురు బిల్లును ప్రజల్లో ప్రచారం చేయాలనీ, నలుగురు చర్చను వాయిదా వేయాలనీ అన్నారు. ప్రతిఘటించినవారుకూడా బిల్లు ప్రతిపాదించిన 8 అంశాలలోనూ అయిదింటిని మాత్రమే ప్రతిఘటించారు.

### బిల్లు ఆశయం

ఈ బిల్లు హిందూ ధర్మశాస్త్రాన్ని, వివాహం, దత్తత, సంరక్షక హక్కు, ఉమ్మడి కుటుంబపు ఆస్తి, స్త్రీ ఆస్తి, నిస్సంతువారసత్వం, మరణశాసనానుసార వారసత్వం, భరణంఅన్న అంశాలమీద క్రోడీకరించి సవరించ ప్రయత్నిస్తున్నది. దత్తతవిషయంలో ఎవరూ ప్రతిఘటించలేదు."

పండిత భార్గవా: నేను ప్రతిఘటించాను.

రోహిణీకుమార్ చౌధరికూడా రెండుసార్లు ప్రసంగానికి అడ్డువచ్చి ఏదో చెప్పబోగా అధ్యక్షుడు నిరాకరించాడు.

డా॥ అంబేద్కర్ ప్రసంగాన్ని కొనసాగించాడు. సంరక్షకత్వం, స్త్రీల ఆస్తి హక్కులు, మరణశాసనానుసార వారసత్వం, భరణంఅన్న అంశాలమీదకూడా ప్రతిఘటనలేదు. ఉన్న ప్రతిఘటనకూడా వాటిలోని రెండు ఉపాంశాలమీదనే వచ్చినది."

రోహిణీకుమార్ చౌధరి తిరిగి అడ్డుపడ ప్రయత్నించగా, అధ్యక్షుడు మందలించాడు.

డా॥ పట్టాభి — సభ్యులు అడ్డువచ్చి చెప్పటానికి అనుమతించకపోతే డా॥ అంబేద్కర్ ప్రకటనలకు సవాలు లేకుండా చెలామణీ కాగలవు. సెలక్టు కమిటీ నివేదికను ఆమోదించవలసినదన్న ప్రతిపాదనమీదనే అంబేద్కర్ మాట్లాడుతున్నాడు కనుక సభ్యులకు అడ్డువచ్చే వీలు ఉండాలి ఒక అంశానికి ప్రతిఘటనే లేదని ఆయన చెప్పగా, నేను ప్రతిఘటించానన్యా అని పండిత భార్గవా చెప్తున్నాడు. కాబట్టి వివాదగ్రస్తమైన అంశాలను అంబేద్కర్ అనకుండా ఉండటం అవసరం."

### బిల్లు ఆవశ్యకత

అంబేద్కర్ మళ్ళీ తన వాదాన్ని ఈ కింది విధంగా సాగించాడు:

"వివాహం విషయంలో వచ్చిన ప్రతిఘటన విడాకులమీద వచ్చింది. ఉమ్మడి కుటుంబపు ఆస్తి విషయంలో వారసత్వపు సమస్యమీదనూ, మరణశాసనంలేని వారసత్వ వ్యవహారంలో కుమార్తెల వాటాను గురించీ మాత్రమే ప్రతిఘటన వచ్చింది.

హిందూ ధర్మశాస్త్రంమీద దేశంలో భిన్న ప్రాంతాలలో భిన్నస్మృతులు బరోడాలో ఒకస్మృతి, కొచిన్ తిరువాన్కూర్ సముఖ్యలో ఒకస్మృతి, మైసూర్‌లో ఒకటి ఈవిధంగావున్న దేశాన్నంతా ఏకంచేస్తున్నాం కనుక హిందూప్రజలందరికీ ఏకైకస్మృతిని తయారుచెయ్యటం అత్యవసరం. విదేశ పాలనకింద ఉన్న ఇతరభారత ప్రాంతాలనుకూడా మనదేశంలో కలిపివేయాలని ప్రయత్నిస్తున్నాము. కనుక ఈ అవసరం మరీ ఎక్కువయినది. ఇక దీనిని వాయిదా వేయటం పనికిరాదు.

### విపక్షతలు తొలగిపోవాలి

బిలును ప్రతిఘటించేవారు నూతన రాజ్యాంగంలోని 15 వ సూత్రాన్ని మరచిపోయినట్లున్నారు. జన్మ, జాతి, కుల, ప్రాంత, లింగవిభేదాలను ప్రభుత్వం పాటించదని ఆ సూత్రం నిర్దేశిస్తున్నది. హిందూధర్మశాస్త్రం బ్రాహ్మణులకీ శూద్రులకీ, స్త్రీలకూ, పురుషులకూ విరక్షత చూపుతున్నదని దానిని చదివినవారంతా అంగీకరించకతప్పదు.

మహావీర్ త్యాగి: అంతేకాదు హిందువుకీ ముస్లిముకీకూడా చూపించబడ్డది.

అంబేద్కర్: హిందూధర్మ శాస్త్రంలో కొన్నిభాగాలు రాజ్యాంగానికి విరుద్ధంగా ఉన్నవి. నూతన రాజ్యాంగానికి భిన్నమయిన అంశాలు రద్దు చేసేఅధికారం 13 వ సూత్రంద్వారా మనకు సంక్రమిస్తున్నది. అందువల్ల హిందూధర్మశాస్త్రాలను క్రోడీకరించి, సవరించటం అవసరం.

డా॥ పట్టాభి: అయితే జనవరి 26 తరవాత, రాజ్యాంగానికి భిన్నంగా ఉండే హిందూధర్మ శాస్త్రసూత్రాలన్నీ రద్దు అవుతున్నాయనా మీ అభిప్రాయం?

అనంతరం బిలును వోటుకుపెట్టగా 11 మందుమాత్రమే వ్యతిరేకంగా వోటు చేశారు. బిల్లును సెలక్టుకమిటీకి పంపాలని ప్రజల్లో ప్రచారంలోకి పంపాలని నజీరుద్దీన్ అహమద్ చేసిన సవరణలు వీగిపోయినవి.

## కర్నాటకుల రాజీనామా

### కాంగ్రెస్ కార్యవర్గంలో చర్చ

న్యూఢిల్లీ, డిసెంబరు 20: అఖిల భారత కాంగ్రెసు కార్యవర్గం నేడు ఉదయము సర్దార్ వల్లభాయిపటేల్ నివాసములో 75 నిమిషాలసేపు సమావేశమైంది గాని, చర్చ పూర్తి కాలేదు. తిరిగి రేపు ఉదయం 8-30 గంటలకు భారత ఉపప్రధాని నివాసంలోనే సమావేశమౌతుంది.

రాష్ట్రశాసనసభలనుంచి పార్లమెంటు నుంచి కర్నాటక సభ్యులు రాజీనామాలివ్వడానికి కేంద్ర పార్లమెంటరీబోర్డు అనుమతి ఇవ్వవలెనని కర్నాటకరాష్ట్ర కాంగ్రెసు చేసిన తీర్మానాన్ని గురించి మాత్రమే నేటి సమావేశంలో చర్చించారు. అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గసభ్యులు, కర్నాటక కాంగ్రెసు అధ్యక్షులు అయిన నిజలింగప్పగారి ప్రసంగాన్ని నేడు కార్యవర్గసభ్యులు విన్నారు.

ఈ విషయంలో కాంగ్రెస్ కార్యవర్గం తన దృక్పథాన్ని ఒక తీర్మానము ద్వారా రేపు వ్యక్తపరుస్తుంది. నేటి సమావేశానికి 15 మంది కార్యవర్గ సభ్యులు హాజరైనారు. రాజెన్‌బాబు, సుచేతా కృపలానీ, ఎస్. కె పాటిల్, డా॥ పి. సి. ఘోష్, కామరాజనాడార్ గారలు హాజరు కాలేదు.

### కాంగ్రెసు అగ్రనాయకుల అభ్యంతరాలు

న్యూఢిల్లీ, డిసెంబరు 19: నేటి సాయంకాలం సర్దారు పటేలు గృహంలో కాంగ్రెసు కేంద్ర పార్లమెంటరీబోర్డు సమావేశం కొద్దిసేపు జరిగింది. కాంగ్రెసు సంస్థకు సంబంధించిన విషయాలు చర్చించబడినవి. స్థానిక పార్లమెంటరీ బోర్డులవారు, శాసన సభలలోగల తమ పార్టీ సభ్యులతోకలసి తిరువాన్కూరు కొచ్చిను యూనియనునుంచీ, మైసూరునుంచీ భారత పార్లమెంటుకు సభ్యులను ఎన్నుకోవాలని నిర్ణయించబడింది.

సమావేశానికి హాజరైనవారిలో కాంగ్రెసు అధ్యక్షుడు డా. పట్టాభి, ప్రధాన కార్యదర్శి కళా వెంకటరావు, మౌలానా అబుల్ కలామ్ అజాద్, నిజలింగప్ప, శంకరరావుదేవు గార్లున్నారు.

రేపు ఉదయం జరిగే కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశంలో కర్నాటక రాష్ట్ర సమస్య చర్చించబడుతుంది కనుక నేడు పార్లమెంటరీబోర్డు సమావేశంలో ఈ విషయమై చర్చ జరగలేదు.

శాసనసభలలో సభ్యత్వాలకు రాజీనామా నివ్వాలని కర్నాటక రాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు చేసిన నిర్ణయాన్ని వర్కింగు కమిటీ ఆమోదించదని తెలుస్తున్నది. కొందరు సభ్యులు రాజీనామా లివ్వడానికి అనుమతికోరుమాత్రమే విజ్ఞాపనలు పంపారటగాని రాజీనామాలు ఎవరూ దాఖలు చేయలేదట. కర్నాటక రాష్ట్ర కాంగ్రెసువారు నవంబరు ఆరంభంలో దేవనగరిలో సర్వసభ్యసమావేశం జరిపి రాజీనామాల పద్ధతిని వ్యతిరేకించి ఉండగా రాష్ట్ర కౌన్సిలువారు ఈ పద్ధతిని సిఫార్సుచేయటం క్రమవిరుద్ధమని తెలుపబడుతున్నది.

కర్నాటకరాష్ట్ర స్థాపనగురించి కాంగ్రెసు అగ్రనాయకుల అభ్యంతరాలు ఈ విధంగా ఉన్నవి. అనేక ముఖ్య సమస్యలనెదుర్కొంటున్న ఇండియా ప్రభుత్వంవారు ఈతరుణంలో భాషారాష్ట్రస్థాపనకు పూనుకోజాలరు. ఏమైనా ఇది ప్రధానసమస్యగా భావించడంలేదు. జె. వి. పి. రిపోర్టులోని నిబంధనప్రకారం కర్నాటక రాష్ట్రంలో చేర్చబడే వివిధప్రాంతాలమన్యం. ఆంధ్ర రాష్ట్రం విషయంలో ఉన్నట్టుగా, ఏకాభిప్రాయం లేదు. మైసూరు ప్రభుత్వం కర్నాటక రాష్ట్ర కాంగ్రెసుతో భేదిస్తున్నది. కేంద్రంపై ఒత్తిడితెచ్చే సంకల్పంతో రాజీనామాల ఆలోచన జరిగింది. ఈఆలోచన ప్రతిఘటించబడుతుంది. రాజీనామాలు చేయగోరేవారిని మానమనిసలహా ఇవ్వడమూ, పట్టుపడితే రాజీనామాలు ఆమోదించడమూ జరుగుతుంది.

### రాజీనామాలు

కె. ఈశ్వర ఎం. ఎల్. ఏ. గారు, కర్నాటకప్రాంత ప్రతినిధి, తన మదరాసు శాసనసభా సభ్యత్వమునకు రాజీనామాను నిజలింగప్పగారికి పంపిరి.

కర్నాటకరాష్ట్రము ఏర్పరుచుట ఆలస్యము చేయుచున్న ఇండియా ప్రభుత్వ చర్యకు నిరసనము తెల్పుచు తన శాసన సభ్యత్వమునకు రాజీనామానిమ్మని అనుమతించవలసినదిగా ముస్లిములీగు అధ్యక్షులకు మహమ్మాదుగారు, లేఖవ్రాసిరి.

## కర్నూలు జిల్లాలో అధికాహారోత్పత్తి కార్యక్రమం

### రెవిన్యూ, పి. డబ్ల్యు. డి. అధికారుల అంచనాలు

కర్నూలు, డిశంబరు 17: అధికాహారోత్పత్తి ప్రణాళిక క్రింద కర్నూలు జిల్లాలో 1912 ఏకరాల భూమి సాగుబడి క్రింద తేవలెనని వేసిన అంచనాల్లో 1845 ఎకరాలు సాగుబడి క్రింద తేబడినటుల యిందుకల్ల 372 టన్నుల ఆహార ధాన్యాలు రాగలదని రివెన్యూవారి అంచనాలవల్ల తెలియుచున్నది. పి. డబ్ల్యు. డి. కాలువల క్రింద 2169 ఎకరాలు, బావులు మరి చిన్న చెరువుల క్రింద సాగుబడి అగుచున్న భూములనుండి 825 టన్నుల ఆహారధాన్యములు యెక్కువ లభించగలదని తెలియుచున్నది. బనగానిపల్లె తాలూకాలో నీటిపారుదల బాగుపరచబడినందున 2830 ఎకరాలు సాగుబడి క్రింద తేబడుటచేత నూతనముగా త్రవ్వబడిన 1172 బావుల క్రింద 2169 ఏకరాలు సాగుబడి అగుటచేత 825 టన్నుల ఆహారధాన్యము లభించగలదనియు, ఇందుకు తోడు వర్షములుకూడ యెక్కువగా పడినందున రెండవపంటకూడ సాగించవచ్చునని తెలియుచున్నది. (స్వ. వి.)

## కర్నూలు పురపాలక సంఘ సమావేశం

కర్నూలు, డిసెం 17:— కర్నూలు మున్సిపల్ కౌన్సిలుయొక్క ప్రత్యేక సమావేశము మొన్న సాయంత్రం చైర్మన్ జనాబు యం. ఏ. ఖాన్‌గారి అధ్యక్షతను జరిగినప్పుడు అజెండాలోనున్న ఒక తీర్మానమును ప్రతిపాదించువారుగాని, బలపరచు వారుగాని లేనందున చేర్మన్‌గారు సమావేశమును ముగించినానని తెలుపగా గందరగోళముతో సమావేశము ముగిసెను. గత అక్టోబర్ 31 వ తేదీన కౌన్సిలువారు, ఎరువు వేయుటకు స్థల నిర్ణయ విషయమై చేసిన తీర్మానము రద్దు చేయుటకు కొంతమంది కౌన్సిలర్లు పంపిన నోటీసు పై యీ ప్రత్యేకసమావేశము యేర్పాటుచేయబడెను.

అజెండాలోని విషయమై చర్చ ప్రారంభము కాగా చైర్మన్‌గారు తీర్మానమును ప్రతిపాదించువారు గాని బలపరచు వారుగాని యెవ్వరైనను వున్నారా అని ప్రశ్నించిరి. జంపాల శేంకరయ్యగారు అన్ని తీర్మానములు వలెనే యీ తీర్మానమును కూడ సభ్యులు చర్చించి నిర్ణయించవచ్చుననియు, ప్రత్యేకముగా దీనిని ఒకరు ప్రతిపాదించి, మరియొకరు బలపరచ వలసిన పని లేదనిరి.

మున్సిపల్ కమీషనరు జే. మోహనరావుగారు చైర్మన్‌గారు అవలంబించిన పద్ధతి సరియైనదనిరి. అందుపై తీవ్రమైన వాదోపవాదములు ప్రారంభమయ్యెను. చివరకు సమావేశము గందరగోళముతో ముగిసెను. (స్వ. వి.)

## 'కార్మికులు ప్రభుత్వంతో సహకరించాలి'

### కాళేశ్వరరావుగారి ఉద్బోధ

విజయవాడ, డిశంబరు 17: అరాచక చర్యలను అణచుటలో, కార్మికులు ప్రభుత్వముతో సహకరింపవలెనని, పారిశ్రామిక కార్యక్రమములలో పాల్గొనవలెనని, మొన్న భాస్కరరావు పేటలో గాంధీజీ విగ్రహమును ఆవిష్కరించుచూ, శ్రీ కాళేశ్వరరావు విజ్ఞప్తి చేసిరి. ఆవిష్కరణోత్సవమునకు శ్రీ పేట బాపయ్య అధ్యక్షత వహించిరి. ముందుగా డా॥ టి. వి. యస్. చలపతిరావు పతాకోత్సవము జరిపిరి.

## నాగపూర్ హైకోర్టు న్యాయమూర్తికి విందు

విజయవాడ, డిశంబరు 16: నాగపూర్ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఆర్. కొసలేంద్రరావుకు, మొన్న మ్యూజియం హాల్‌లో, స్థానిక ప్రముఖులు అల్పాహార విందును చేసిరి. శ్రీ కాళేశ్వరరావు శ్రీ పాతూరి నాగభూషణం శ్రీ బి. కుటుంబరావు మొదలైన అనేకులు పాల్గొనిరి.

ఆంధ్ర స్వరాజ్య పార్టీ నాయకులు శ్రీ సమ్మెటిడిదల వెంకటసుబ్బారావు శ్రీ కొసలేంద్రరావు గౌరవార్థమై మరొక అల్పాహారవిందును ఇచ్చిరి.

## రాజాజీకి సింధియా కార్మికుల మహజరు

గాంధీగ్రామ్, డిసెంబరు 16: నేటి సాయంత్రం గవర్నర్ జనరల్ రాజాజీ విశాఖపట్నం నిర్మాణకేంద్రానికి విచ్చేసిన సందర్భంలో సింధియా కార్మికప్రతినిధులాయనను కలుసుకుని తాము ప్రభుత్వానికి తమ కష్టనష్టాలను వివరిస్తూ యిదివరకే సమర్పించిన రెండు విజ్ఞప్తిపత్రాలను సమర్పించారు. ఈ ప్రతినిధివర్గములో సింధియా నౌకా నిర్మాణపరిశ్రమ కార్మిక సంఘ ఉపాధ్యక్షుడు బి. అప్పారావు, ప్రధాన కార్యదర్శి ఎస్. సాంబశివరావ్ బాబ్జీ, సహాయకార్యదర్శి కర్రి అప్పారావు, ఉద్యోగులసంఘ ఉపాధ్యక్షుడు పి. అప్పారావు, సహాయకార్యదర్శి సన్యాశిరావు, శ్రీయుతులు సూరిశెట్టి జగ్గయ్య, కె. గాంధీరావు, సోమయాజులుగార్లు ఉన్నారు. కార్మికుల విజ్ఞప్తిపత్రాలను చిరునవ్వుతో స్వీకరిస్తూ రాజాజీ ఈ నౌకానిర్మాణపరిశ్రమ పనిని వేయడం మాత్రం జరగదన్నారు.

## గుంటూరు పురపాలక సంఘ సమావేశం

గుంటూరు, డిసెంబరు 16: గుంటూరు పురపాలకసంఘసమావేశము నిన్న ఉప్పుటూరి వెంకటపున్నయ్యగారి అగ్రాసనాధిపత్యము క్రింద జరిగినప్పుడు బ్రాడీపేట రెండవ లైను రోడ్డును 'జేళధ క్తరోడ్డు' అని పిలుచుటకు తీర్మానించిరి. ఆ రెండవ లంపేటలోని 'రంగాచారి పార్కును' కేవలం స్త్రీల కొరకే ఉపయోగపడునట్లు నిర్ణయం చేశారు. చావలి నాగేశ్వరరావుగారిచే చిత్రింపబడిన మహాత్ముని, కాంగ్రెసు అధ్యక్షులు డా॥ పట్టాభిసీతారామయ్యగార్లచే చిత్రపటములు కౌన్సిలు హాలులో ఉంచుటకుగాను, రు 750,లు రు 375లకు ఖరీదు చేయుటకు తీర్మానించారు. శారదానికేతనమునకు రు 12,00 లున్నూ, కస్తూరిబా వెల్‌ఫేరు సెంటరుకు రు 1200లున్నూ విరాళములు యిచ్చుటకు నిర్ణయించారు. మద్రాసు మేయరు యీ పట్టణమునకు విచ్చేయు సందర్భములో వారికి సన్మాన పత్రం సమర్పించుటకు తీర్మానించారు. (స్వ. వి.)

## జ్యోతి సాహితీ సమితి సర్వసభ్య సమావేశం

విజయవాడ, డిసెంబరు 18: "జ్యోతి సాహితి సమితి" సర్వసభ్య సమావేశం నిన్న యిక్కడ రాయన్ భవనమున జరిగినది. చింతపల్లి కృష్ణమూర్తి శాస్త్రిగారు సమావేశానికి అధ్యక్షత వహించారు. శాస్త్రిగారు తమ గ్రంథాలలోని పద్యాలు కొన్ని చదివారు. జమీందార్ చాగా లక్ష్మీనరసింహంగారు, జ్యోతి సాహితీ సమితిని గురించి మాట్లాడారు. పిమ్మట పాటిబండ రాజేశ్వర శర్మగారిచే రచింపబడిన "జ్యోతి సాహితి సమితి" బుర్రకథ చెప్పబడినది సభ్యుల అభినందనములతో సభ ముగిసింది.

## కీ॥ శే॥ గరికపర్తి వెంకటశివుడుగారు

కాకినాడ, డిశంబరు 16: కాకినాడ నగరంలో ప్రఖ్యాతి గడించిన మాస్టరు టైలరు గరికపర్తి వెంకటశివుడుగారు (81 సం॥ లు) నిన్న ఉదయం 11 గంటలకు కాలధర్మమునొందిరి. కాకినాడ టయిలర్సు యూనియను సభ్యులందరు వారి గౌరవార్థము తమ షాపులను మూసివైచి అంత్యక్రియలలో పాల్గొని సానుభూతిని తెల్పిరి. (స్వ. వి.)

## ఆంధ్రవిద్యార్థుల ఆటల పోటీలు

### వారాంతమున విజయవాడలో ప్రారంభం

విజయవాడ, డిసెంబరు 18: ఆంధ్ర విద్యార్థి కాంగ్రెసువారిచే, ప్రప్రథమముగా ఆటలపోటీలు [ఒలింపియడ్] ఈ నెల 24 నాటినుంచి 31 తేదీవరకు ఏర్పాటు చేయబడుచున్నవి. ఆంధ్రదేశము నలుమూలల విద్యాసంస్థలన్నియునూ ఈ ఆటల పోటీలలో పాల్గొనబోవుచున్నవని ఒలింపియడ్ కార్యదర్శి మునిరెడ్డిగారు తెలియజేస్తున్నారు. కార్యక్రమములో దాదాపు 28 [గేమ్స్ స్పోర్ట్స్] పోటీలు చేర్చబడినవి. కార్యక్రమమంతయును అఖిల భారత అంతర్జాతీయ ఒలింపియడ్ ఆచారముల ననుసరించియే నడుపబడును. ఈ ఆటలకొరకై బందరురోడ్డు ప్రక్కన ఒక ప్రత్యేక స్టేడియం నిర్మింపబడుచున్నది. ఒలింపియడ్‌ను చూచుటకు అనేకులు రాజకీయనాయకులు, విద్యావంతులు ఆహ్వానింపబడిరి. ఒలింపియడ్‌లో ఆటలేగాక ఉపన్యాసములు, వినోదములు, అనేకము చేర్చబడినవి. డిశంబర్ 24 నాటి ఉదయము స్టేడియంవద్ద పుయ్యూరు కుమారరాజాగారు పతాకోత్సవమును జరుపుదురు. తదుపరి శ్రీ టంగుటూరి ప్రకాశం, ఆటలకు ప్రారంభోత్సవం జరిపెదరు. యస్. జి. రంగాగారు డిశంబర్ 30 నాడు స్పోర్ట్సుకు ప్రారంభోత్సవం జరుపుదురు. డిశంబర్ 31 నాడు 'ప్రథమ ఆంధ్ర ఒలింపియడ్ మహాసభ' జరుగును. డా॥ యస్. చెన్నారెడ్డి, మానవపెద్ది జానకిరామయ్య, సుంకర సత్యనారాయణ, దండమూడి రాజగోపాలరావు, కాకాని వెంకటరత్నం గారలు మహాసభలో ఉపన్యసింతురు.

## ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు మహాసభ

ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు మహాసభలు 1950 జనవరి 1, 2, తేదులలో జరుగునని విద్యార్థి కాంగ్రెసు అధ్యక్షుడు సుంకర సత్యనారాయణగారు తెల్పుచున్నారు.

సంయుక్తరాష్ట్ర కిసాన్ కాంగ్రెసు అధ్యక్షుడు బాబు త్రిలోక్ సింగ్ ప్రారంభోపన్యాసము నిచ్చును. ప్రకాశం, రంగా మొదలైనవారు ఉపన్యసించెదరు. తదుపరి, వక్తృత్వపు పోటీలు, పాటల పోటీలు జరుగును.

జనవరి 2 నాడు శ్రీమతి అమ్మన్న రాజా అధ్యక్షత క్రింద "మాక్‌పార్లమెంట్" (నమూనాశాసనసభ) సమావేశమగును. ఇందులో మంత్రి పదవుల నలంకరించు రాజకీయపు పార్టీ కిసాన్ మజ్దూర్ ప్రజాపక్షము, తరువాత సార్ల వెంకటేశ్వరరావు అధ్యక్షత క్రింద వైజ్ఞానిక సమావేశము జరుగును. విశ్వనాథ సత్యనారాయణ, పెద్దాడ రామస్వామి, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, ఖాసా సుబ్బారావుగారలు ఉపన్యసింతురు.

ఆ తర్వాత ఇ. సుబ్రహ్మణ్యం అధ్యక్షత క్రింద వివిధోపన్యాసములు ఏర్పాటు చేయబడినవి.

మహాసభ భరతనాట్యము, వినోదములు, పాటలతో సమాప్తమగును.

## ఆంధ్రాఎమెచ్యూర్ వెయిట్ లిఫ్టింగ్ పోటీలు

వానపాముల, డిశంబరు 17: గుంటూరులో ఈ నెల 26 వ తేదీన సాయంకాలము 2 గం॥ నుండి ఆంధ్రా ఎమెచ్యూర్ వెయిట్ లిఫ్టింగ్ పోటీలు మద్రాసు ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతను జరుపబడును. దీనికి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షులు ఆర్. బి. రామకృష్ణరాజుగారు ప్రారంభోత్సవం జరిపెదరు. పుయ్యూరు కుమారరాజాగారు పతాకోత్సవము గావింతురు. ఈ పోటీలు ఆసనములు వేయుటలోను, బరువులు ఎత్తుటలోను, శరీరసౌష్ఠవములోను, దండీలు బస్కీలు తీయుటలోను జరుగును. దరఖాస్తులు పోటీల రోజునకూడా తీసికొనబడును. 27 వ తేదీ ఉదయమున "ఆంధ్రా ఎమెచ్యూర్ వెయిట్ లిఫ్టర్స్ ఎసోసియేషన్", కు నూతన సంవత్సర కార్యనిర్వాహకవర్గ ఎన్నిక జరుగును. కనుక భ్యాయామ ప్రియులు రావలసిందిగా అని డి రాజగోపాల్‌గారు ప్రార్థిస్తున్నారు.

## చేబ్రోలులో విజయ టాకీసు ప్రారంభం

తెనాలి, డిశంబరు 17: ఈ తాలూకా చేబ్రోలు గ్రామంలో నాశిరెడ్డి మహాలక్ష్మయ్యగారిచే నిర్మింపబడిన విజయ టాకీసుకు మొన్నటి రోజున తెనాలి మునిసిపల్ చైర్మన్ నన్నపనేని వెంకటరావుగారు ప్రారంభోత్సవము గావించిరి. ఉత్సవానికి తెనాలి గుంటూరునుండి అనేకమంది ప్రముఖులరుదెంచిరి. అల్పాహారవిందు గావింపబడెను.

## తుపాను బాధితులకు సహాయం

### ఫిలింపారిశ్రామికుల సంఘం వసూళ్లు

చెన్నపట్నం, డిసెంబరు 19: ఫిలింపారిశ్రామికుల ఆంధ్ర తుపాను బాధితుల సహాయ సంఘం వారికి ఈనెల 10 నుంచి ఈ దిగువ విరాళాలు అందినవి. ఎస్. వరలక్ష్మి రూ. 3,000/- ఎస్. పి. వెంకట్రామన్ రూ. 500/- ఐ. పుష్పవల్లి రూ 500/- నారాయణన్ అండ్ కో రూ. 250/-లు, మోడరన్ థియేటర్స్ లిమిటెడ్ (సేలం) రూ. 250/- పి. ఎస్. ఆర్. ఆంజనేయులు రూ. 200/- శ్రీ రాజరాజేశ్వరీ ఫిలింకంపెనీ ఉద్యోగులు రూ. 170/- టి. ఆర్. రామనాథన్ రూ. 116/- ఎం. వి. రాజమ్మ రూ. 50/- లోగడ వచ్చిన విరాళాలు రూ. 41,746/- లతో ఇంతవరకు మొత్తం వసూళ్ళు రూ. 46,782/-లు.

## నిడుబ్రోలు పొన్నూరలలో పంచదార పంపకం

పొన్నూరు, డిశంబరు 16: నిడుబ్రోలు పొన్నూరు గ్రామాలకు, నెలకు 20 బస్తాల పంచదారకోటా యివ్వబడినది.

యిందుకు గాను, వివాహాది కార్యాలకు, తదితర ప్రత్యేక అవుసరాలకు 8 బస్తాలు వినియోగించి, మిగతా 12 బస్తాలు, పర్మిట్ల మీద జనసామాన్యానికి పంచుతారని తెలుస్తున్నది.

## మద్యనిషేధం కింద శిక్షలు

పొన్నూరు, డిశంబరు 16: స్థానిక సబ్ మేజిస్ట్రేటు పి. యస్ గణపతి సుందరం గారు కల్లుగీచినందుకు, దగ్గర వుంచుకున్నందులకు, కొండ కోటయ్య, సుబ్బయ్య వెంకయ్యలకు, ఒక్కొక్కరికి రు 50/- జరిమానా విధించారు.

టి. శేషయ్య, యస్. నరసయ్య, జి. కోటి రెడ్డిలకు, తమ చెట్లను కల్లుగీతకు యిచ్చినందులకు, ఒక్కొక్కరికి రూ 30 జరిమానా విధించారు. (స్వ. వి.)

## బందరు పట్టణ విద్యార్థి కాంగ్రెసు సమావేశము

బందరు, డిశంబరు 17: నిన్న సాయంత్రము వి. వి. కృష్ణారావుగారి అధ్యక్షతను బందరు పట్టణ విద్యార్థి కాంగ్రెసు సర్వసభ్య సమావేశం జరిగినప్పుడు నూతన సంవత్సరమునకు కొల్లూరి రాఘవయ్యగార్ని అధ్యక్షులుగాను పచ్చారి పోతరాజుగార్ని కార్యదర్శిగాను ఎన్నుకున్నారు. మరి 9 మందితో కార్యవర్గమును ఎన్నుకొన్నారు.

# ఆంధ్రరాష్ట్రనిర్మాణం: కర్ణాటకుల వైఖరి

## బళ్లారిజిల్లా "ద్వీప" మైపోవు నని శ్రీ నిజలింగప్ప ప్రకటన

బొంబాయి, డిశంబరు 18: ప్రత్యేక కర్ణాటకరాష్ట్ర నిర్మాణమునకై సత్యాగ్రహమునకు గడంగు ప్రసక్తి యేమియు లేదని ఈ సమస్యపై కాంగ్రెస్ అధిష్ఠాన వర్గమునకును, క. రా. కాం. సంఘమున కును రాజీ జరిగినయెడల కన్నడిగులు సంతృప్తిచెందెదరని క. రా. కాం. సంఘాధ్యక్షులైన శ్రీ నిజలింగప్పగారు, పార్లమెంటరీ బోర్డు సభలో పాల్గొనుటకై ఢిల్లీ వెళ్లుచు యిచ్చటికి వచ్చినవారు నేడు పత్రికా ప్రతినిధులతో ప్రసంగించుచు చెప్పిరి.

కర్ణాటక రాష్ట్రనిర్మాణములో ఆలస్యము జరుగుటవల్ల కర్ణాటకులు సహనము గోల్పోవుచున్నారని ఆయన చెప్పెను. ఇదివరకు కర్ణాటకులు 22 పరిపాలనలలో నుండిరని, సర్దార్ చాకచక్యమువల్ల వారు యిప్పుడు 5 ప్రభుత్వములక్రింద నున్నారని ఆయన చెప్పెను. మైసూరులో 75 లక్షల మంది, బొంబాయి రాష్ట్రములో 55 లక్షల మంది, మద్రాసులో 28 లక్షలు, కూర్గులో దాదాపు 2 లక్షలు, హైదరాబాదులో దాదాపు 35 లక్షలు వున్నారనిరి. కర్ణాటక రాష్ట్రోద్యమము 1915 సం॥ములో ప్రారంభమయ్యెనని, రాష్ట్రమును వెంటనే తప్పక నిర్మించవలెనని ఆయన చెప్పెను.

'ఒక్క ఆంధ్ర రాష్ట్రమును నిర్మించుటవల్ల కర్ణాటకమునకు నష్టముకలుగును. బళ్ళారి జిల్లాయందలి కన్నడిగులు ఒకద్వీపవాసులగుదురు. ఈ విధముగానే మైసూరు దక్షిణమున, సైరుతిన, ఆగ్నేయమున కన్నడిగులు విస్తారముగానున్న ప్రాంతములు ఆంధ్ర, తమిళ నాడులలో భాగములగును. ఈ ప్రాంతములవారికి స్వగృహమనునది యుండదు. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము జరుగుచుండుటచేత తమకుగూడ రాష్ట్ర మేర్పడవలెనను కాంక్ష కన్నడిగులకు హెచ్చినది' అని శ్రీనిజలింగప్పగారు చెప్పిరి.

10 సంవత్సరములలో కర్ణాటక రాష్ట్రము అన్ని విషయముల స్వయంపోషకము కాగలదనిరి. బెంగళూరే కర్ణాటక రాష్ట్ర రాజధాని యగునని, క్రొత్త రాజధానిని నిర్మించ నవసరము లేదని ఆయన చెప్పెను.

కర్ణాటక రాష్ట్రములో హైదరాబాదు మినహా మైసూరు అగ్రభాగమని, నెహ్రూ పటేల్ - పట్టాభిల వేదిక ననుసరించి మైసూరుతో సహా కర్ణాటక రాష్ట్ర మేర్పడినట్లయిన మైసూరు అదృశ్యమగునని ఆయన చెప్పెను. ప్రస్తుత రాజ్యాంగము ననుసరించి మైసూరు మహారాజు ఒక గవర్నరయ్యెనని ఈ విధముగా నాలోచించిన మైసూరు అదృశ్యమైనట్లే యని ఆయన చెప్పెను మైసూరులోను, మైసూరు వెలుపలనుగూడ ప్రజలు ఐక్య కర్ణాటక మేర్పడవలెనని వాంఛించుచున్నారని, మైసూరు రాజ్యాంగ పరిషత్తు ఈ సిద్ధాంతమును ఆమోదించెనని ఆయన చెప్పెను. మైసూరు మహారాజు కర్ణాటకమునకంతటికి రాజ్యాంగాధిపతిగా నుండుటకు ఎటువంటి ఆక్షేపణ లేదని ఆయన చెప్పెను.

## ఐక్య కేరళ నిర్మాణం

### కె. పి. సి. సి. తీర్మానము

షోరనూర్, డిశంబరు 18: ఐక్య కేరళ నిర్మాణములో ఆవసరమగు ఆలస్యము పనికి రాదని యిచ్చట సమావేశమైన కేరళ కాంగ్రెస్ కమిటీ వారు ఒక తీర్మానములో తెలియ జేసిరి. ముందే ర్పరుప దలచుచున్న యితర భాషా రాష్ట్రములు రెండింటితో కూడ వలసియున్న పరిపాలనా సంబంధమగు సమస్యలు కేరళమునకు లేవని తీర్మానము తెలిపెను. కేరళరాష్ట్ర నిర్మాణము చారిత్రకములు, సైసర్గికములు, ఆర్థికములు, సాంస్కృతికములను కారణములపై నాధారపడు ఏకీకరణమేగాని అన్యము కావని స్వతంత్ర భారతజాతీయ పునర్నిర్మాణములో కేరళరాష్ట్ర నిర్మాణము విషయమై అశ్రద్ధచేయ వీలులేదని తీర్మానము తెలిపెను.

సభకు శ్రీ కేలప్పన్‌గారు అధ్యక్షత వహించిరి మద్రాసు న్యాయశాఖామంత్రి శ్రీ మాధవమీనన్, కొచ్చిన్ దివాన్ కూడ సంయుక్తరాష్ట్ర మంత్రులు హాజరైరి.

## సవరణ

రాజమండ్రి, డిశంబరు 15: ఆంధ్ర విశ్వకళాపరిషత్తుపై సెనేటు సభ్యులు పి. సీతాపతిరావుగారు విశాఖజిల్లా మునసబు కోర్టులో దాఖలుచేసిన దావా ప్రోసీడింగులు జరిగినవని ఈ నెల 11 వ తేదీ ఆంధ్ర పత్రికలో ప్రకటింపబడిన వార్త సరియైనది కాదని, 'ఇంటెరిం ఇంజక్షను'కై దాఖలు పెట్టిన పిటీషను మాత్రమే ప్రోసెసు చేయబడిందని, పి. సీతాపతిరావుగారు వ్రాయుచున్నారు.

# "యువకులలో నీతివిజ్ఞానాలవ్యాప్తి: విశ్వవిద్యాలయాల కర్తవ్యం"

## మైసూరు యూనివర్శిటీ ప్రత్యేక పట్టప్రదానోత్సవంలో రాజాజీ ఉద్బోధ

బెంగుళూరు, డిసెంబర్ 19: "మనలో విజ్ఞానవంతులుగానున్న వారి ప్రవర్తనకు ప్రమాణ మేర్పరచుటయు, వివిధవృత్తులలో నాయకత్వము వహించుటకవసరమైన వైజ్ఞానిక, నైతికసంపత్తిని యువకులకు అలవరచుటయు విశ్వవిద్యాలయముల కర్తవ్యము" అని భారత గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారిగారు నేడు తమకు గౌరవడిగ్రీ నొసంగుటకై జరిగిన మైసూరు విశ్వవిద్యాలయ ప్రత్యేక పట్టప్రదాన సభలో ఉపన్యసించుచు నుడివిరి.

భారత విశ్వవిద్యాలయములకు ఒకనిశ్చితమైన స్వరూప మేర్పడెనని ఆయన చెప్పుచు, ఈస్వరూపమును మార్చుట ఒక వేళ సాధ్యమైనప్పటికి దానిని మార్చ ప్రయత్నించుట వివేకము కాదని, ఖర్చుగూడ కలిసిరాదని ఆచారిగారు చెప్పిరి. కాయకష్టము గౌరవప్రదమైనదని ఆయన చెప్పుచు, విద్యార్థులు తమ విద్యను సంపూర్ణమైనదానిని చేసికొనుటకు కాయకష్టము చేయవలెనని ఉద్బోధించిరి.

మైసూరు విశ్వవిద్యాలయ స్థాపనమునకు పూర్వము సెంట్రల్ కాలేజిలో తాను 6 సంవత్సరములు విద్యనభ్యసించిన విషయమును ఆచారిగారు సభికుల కెరుకపరచి సెంట్రల్ కాలేజి ఉపన్యాస శాలలు, క్రీడాభూములు, ఫలాహార శాలలు తన కత్యంత ప్రియమైన వనిరి. సెంట్రల్ కాలేజీయే తనకు ఈ నూతన గౌరవము ప్రసాదించి, తనకు విద్యాదానము చేసిన సంస్థయెడల తన బాధ్యతను నిసుమడింప జేసినట్లు తాను భావించుచుండెననిరి.

### డా॥ రెడ్డిగారి అమూల్య సలహా

"అత్యంత ప్రతిభావంతుడుగా విఖ్యాతి వహించిన వైస్‌ఛాన్సలర్ (డా॥ సి. ఆర్. రెడ్డిగారు) యిటీవల ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టప్రదాన ఉపన్యాసము గావించుచు అనేక ముఖ్య విషయములను గూర్చి హృద్యముగా నిరుపమానముగ ప్రజ్ఞతో వివరించియున్నారు. వారు చెప్పిన ప్రతిమాటను నేను ఆమోదించుచున్నాను. ఆయన ఒసంగిన అమూల్యమైన సలహాను ఆచరణలో నుంచవలెనని యువకులను యిందుమూలమున కోరుచున్నాను' అని ఆచారిగారు చెప్పిరి.

'బాగుగా అభివృద్ధియైన పాశ్చాత్య దేశములలో విశ్వవిద్యాలయములు శాస్త్ర పరిశోధనలోను, తత్త్వశాస్త్ర పరిశోధనలోను నిమగ్నమై యున్నవి. భారత విశ్వవిద్యాలయములు గూడ యిట్టివిగా నుండవలెనను భావము రమ్యమైనదే. కాని భారత విశ్వవిద్యాలయములకు, నిశితమైన స్వరూపము, కొన్ని లక్షణములు యేర్పడినవి. వీనిని మార్చ ప్రయత్నించుట సాధ్యమైనప్పటికి, వానిని మార్చుట వివేకము కాదు. ఖర్చుగూడ కలిసిరాదు. మన విశ్వవిద్యాలయములలో పరిశోధనకొంతగా జరుగుచున్నది. ఇంకా యెక్కువగా పరిశోధనలు సాగించవలెను. ఇట్టిపరిశోధనలు చేయువారు కొద్దిమంది మాత్రమే యుందురు. పరిశోధనకు సంబంధించిన వీరి కార్యకలాపములకు విశ్వవిద్యాలయములు భంగము కలిగించకుండా తక్కిన వారికి సామాన్యవిషయపరిజ్ఞానము కలిగించవలెను. మనలో విజ్ఞానవంతులగు వారి ప్రవర్తనకు ఒక ప్రమాణము నేర్పరుచుటయు, వివిధవృత్తులలో నాయకత్వము వహించువారికి అవసరమైన సాంస్కృతిక, నైతికసంపత్తిని అలవరచుటయు, మన విశ్వవిద్యాలయముల పరమధర్మము' అని ఆచారిగారు చెప్పిరి.

### సేవానిరతి, త్యాగనిరతి అవసరము

భారతదేశ భౌతిక, నైతిక సంపదను వృద్ధిచేయుటకు విద్యార్థులు తోడ్పడవలెనని ఆచారిగారు చెప్పిరి. బ్రిటిష్‌ప్రభుత్వముతో పోరాడుచుండిన సమయమున స్వాతంత్ర్య తంత్రావ మా యువకుల కెంతో ఆకర్షణీయమైనదిగా నుండెనో స్వతంత్ర భారతములో నిర్మాణ కార్యక్రమ నిర్వహణము అంత ఆకర్షణీయముగా నుండవలెనని, జాతీయ జీవితమునందలి ప్రతి రంగములోను త్యాగ నిరతి, సేవానిరతి అవసరమని ఆచారిగారు చెప్పిరి. స్వతంత్ర భారతములో యువకులు, యువతులు చేయవలసిన పని విశేషముగా నున్నదనిరి. ధైర్యముతో, ఆత్మ విశ్వాసముతో దేశాభివృద్ధికై కృషి చేయవలెనని, మూడుతరములవారి అభ్యుదయమునకు గాను యిప్పుడు మనము అవసరమైన త్యాగములు చేయవలెనని రాజాజీ ఉద్బోధించిరి.

ప్రపంచ రాజకీయ వేత్తలు భారతదేశముపై గొప్ప ఆశలు పెట్టుకొనియున్నారు. గాంధిమహాత్ముని జీవితము, ఆయన నాయకత్వము ఈ ఆశలకు చాలావరకు కారణము. భారతదేశము గొప్పదికావలెనన్న దానిలో చేరియున్న వివిధ భాగములు తోడ్పడవలెను. మైసూరుకూడా తోడ్పడవలెను. ఈ గొప్పతనమునకు మైసూరు చేయుకృషి విశ్వవిద్యాలయములో చదువుకొన్న యువతుల, యువకుల సంకల్పబలముపై ఆధారపడియుండును' అని రాజాజీ చెప్పిరి.

కేవలము చదువువల్ల విద్య పరిపూర్ణము కాదని, ఏ విద్యావిధానమునందైనను చేతిపని అత్యంత ప్రాముఖ్యం వహించునని రాజాజీ చెప్పిరి పనివల్ల తెలివితేటలు కేవలము అక్షరజ్ఞానము వల్లగాక. పనివల్లను ఆటలవల్లను వృద్ధియగునని, గ్రంథములద్వారాను, ఉపన్యాసముల ద్వారాను, ఆర్జించినజ్ఞానము క్రీడాస్థానములలోను, కర్మాగారములలోను, లాబరేటరీలలోను చేయు పనులవల్ల పరిపూర్ణమగునని ఆయన చెప్పెను. పాఠశాలలకు వెళ్లుచుండే విద్యార్థులు తమ యిండ్లలోగాని, యితరత్రగాని చేతులతో పని చేయవలెనని ఉద్బోధించిరి. పనివల్ల ప్రస్తుతవిద్యా విధానములోని లోపము తొలగుననిరి. చేతిపనికి గౌరవము పోయినదని, తిరిగి దానికి గౌరవము కలిగించవలెనని ఆయన చెప్పెను.

తనకు చూపినమన్నన, తనకు గౌరవపట్టము ప్రసాదించుటకు ఈ ఉత్సవము ప్రత్యేకముగా యేర్పాటు చేసినందుకు కృతజ్ఞత దెలుపుచు గవర్నరు జనరలు ఉపన్యాసమును సమాప్తము గావించిరి.

# పుంగాపురంలో వయోజనవిద్యాశిక్షణకేంద్రం

## చంద్రగిరి సబ్ కలెక్టరుచే ప్రారంభోత్సవం

మంగాపురం, డిసెంబరు 17: మదరాసు ప్రభుత్వమువారచే మంగాపురమందు ఏర్పాటుచేయబడిన వయోజనవిద్య ఉపాధ్యాయ శిక్షణకేంద్రమునొక్క ప్రారంభోత్సవము మొన్న జరుపబడెను చంద్రగిరి సబ్ కలెక్టరు కె. ఎస్. శివసుబ్రహ్మణ్యంగారు ప్రారంభోత్సవమును జరిపిరి. ఆంధ్రదేశ వయోజనవిద్య గౌరవ డైరెక్టరు గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఉత్సవసభకు అధ్యక్షత వహించిరి. తమ ప్రారంభోపన్యాసములో శివసుబ్రహ్మణ్యంగారు వయోజన ఓటు వచ్చిన యీ కాలములో చదువునకు వ్రాతకు ఎక్కువ ప్రాముఖ్యమున్నదనిరి. వయోజనుల దృక్పథాన్ని సరియగు మార్గములోకి తెచ్చుటకు వయోజనులకు విద్య చాల అవసరమని చెప్పిరి. హరిసర్వోత్తమరావుగారు యీ క్రిందివిధముగ ఉపన్యసించిరి. వయోజనవిద్య విషయములో అనుభవము పెరిగినకొలది దృక్పథము మారుతూ వున్నది ప్రస్తుతము ఉపాధ్యాయులకు యివ్వబడుతున్న తరిఫీదు వారికి, 4 మాసములలో నిరక్షరాస్యులకు చదువు వ్రాత నేర్పే సామర్థ్యాన్ని యిచ్చేటందుకు ఉద్దేశింపబడినది పై నాలుగు మాసములలోను సమర్థులగువారిచేత వివిధ విషయములపై 40 ఉపన్యాసములుయిప్పించి వయోజనులయొక్క విజ్ఞానము అభివృద్ధి చేయవలసియున్నది. తరిఫీదుపొందిన ఉపాధ్యాయుడు యీ పనిని చేయుచు వయోజనవిద్యా ప్రణాళికలో ప్రభుత్వముచే నియమింపబడిన 3 సంవత్సరముల విద్యా విధానాన్ని అవలంబించి అక్షరాస్యత సంపాదించిన వయోజనులయొక్క విద్యాసంస్కారము చేయవచ్చును.

వయోజన విద్యావ్యాప్తిని ప్రతి ఉపాధ్యాయుడు తన పవిత్రధర్మముగ ఎంచవలెను. ఆతడు విద్యాకేంద్రములో ఆకర్షవంతమగు కార్యక్రమములద్వారా అక్షరాస్యులను నిరక్షరాస్యులను సమావేశపరచి అక్షరాస్యతావ్యాప్తికి అక్షరాస్యుల సహాయాన్ని పొందవలసియున్నది. వచ్చే ప్రజాస్వామ్య యుగంలో, సాంఘిక విషయాలలోను, విద్యా విషయాలలోను, జాతి, మత, కుల విచక్షతలు, అధికార అనధికార విచక్షతలు నిలువ నేరవు. అందువలన విద్యాగంధమును స్త్రీ పురుషులెల్లరు యితరులకు తెలుసుకున్న ఆ కాళలను సంపాదించిపెట్టేటందుకు నడుముకట్టి పాటుపడవలెను.

హరిసర్వోత్తమరావుగారు తమ ఉపన్యాసమును ముగిస్తూ దేశంలోని ప్రతివ్యక్తి వయోజన విద్యావ్యాప్తికి శక్తికొలదిపాటుపడవలసినదని నుడివిరి.

చంద్రగిరి స్కూల్స్ డెప్యూటి యినస్పెక్టరు మోహన రామిరెడ్డిగారు వయోజన విద్యావశ్యకతనుగూర్చి ముచ్చటించిరి. శిక్షణ కేంద్ర ప్రధానోపాధ్యాయులగు బి. వి. ఎస్. ప్రకాశరావుగారి వందన సమర్పణతో ఉత్సవ కార్యక్రమం ముగిసెను.

# "సంఘసేవయే ప్రతి స్త్రీ కర్తవ్యం"

## సేవా సమాజంలో గవర్నరు జనరల్ ఉద్బోధ

మదరాసు, డిసెంబరు 19:

"తల్లి తండ్రికూడా లేని బిడ్డ బాగా బ్రతుకలేనట్లే దేశంకూడ ప్రభుత్వము సంఘ సేవాసంస్థలు రెండూ ప్రత్యేకంగా నుంటేగాని వృద్ధిపొందజాలదు. సంఘసేవా కార్యము స్త్రీల ప్రత్యేక బాధ్యత. స్త్రీలు యిప్పుడు గుమాస్తా పనులు తమకొసంగుచున్నారనకడా అని సనాతన విద్యుక్తధర్మమును మరచిపోరాదు సంఘసేవాసంస్థలందు ఎక్కువగ చేరి శ్రద్ధగ పని చేయవలెను" అని గవర్నరు జనరలు రాజగోపాలాచారిగారు 18 వ తేదీ సాయంకాలం సేవా సమాజమునందుపన్యసించుచు హెచ్చరించిరి. చక్కగ అలంకరించబడిన రాజాజీహాలులో వారికి శ్రీమతి గాలాసలీ, పి. భాష్యంఅయ్యంగారు మున్నగువారు స్వాగతమొసంగిరి. గవర్నరుసతి భావనగరు మహారాణీ సేవాసమాజము అధ్యక్షురాలు స్వాగతోపన్యాసమునందు 25 సం॥ల నుండి యీ సంస్థ చేయుచున్న పనిగూర్చి క్లుప్తంగా తెలిపిరి.

రాజాజీ ప్రత్యుత్తర మొసంగుచు, గౌరవమర్యాదలు ప్రజాదరణ సహజ లక్షణములుగా గల రాజవంశమునకు చెందిన మహారాణీగారు యిపుడు రాష్ట్ర సంఘసేవా సమాజము కార్యములు నిర్వహించుచున్నందుకు సంతసించుచున్నాననిరి.

"లేడీ సైగారు తలపెట్టిన యీ సమాజము ఆమె ఉద్దేశింపబడిన ప్రకారము నిర్వహింపబడుచుండుట ముదావహము. క్లాబువాలాసతిగారుండవనే యున్నారు. ఇటీవల వి. భాష్యంగారి సహాయం వీరు లభించినది. సాంఘికసేవయందు పనిచేయు ఉత్తమ స్త్రీలతో పోల్చదగువారు వీరు. (నవ్వు) సౌమ్యగుణమే ఏపనియందైన స్త్రీకి పురుషునికిగల తేడా. ఆ సౌమ్యగుణం వీరిలో ఎక్కువగనుంది. మనందరికన్న యువకులు వీరు. సేవాశక్తి, మనోతత్వమే యువలక్షణములు. అవివీరికి మెండుగగలవు.

"పూర్వం సంఘసేవా కార్యములు స్త్రీలు బిరుదులకొరకై గవర్నరులవాళించి చేసినవారు. ఇపుడు ప్రభుత్వమందరమే ప్రజారాజ్యమునకు కుదించి అయినది. అచట్లుకుపోయి ఈ కార్యనిర్వహణ కితాబులు పొందినవారు తమసమానులుగ ప్రజలెందవచ్చును."

"సంఘసేవా కార్యము కూడ ప్రభుత్వ కార్యములలో భాగమే. ప్రభుత్వంకూడ సంఘసేవా ప్రచారకుని వంటిదే కాని సంఘసేవకులు ప్రజలలో తిరిగి మంచిచేసుకున్నట్లు ప్రభుత్వం చేసుకోజాలదు. బిడ్డ బాగుగా పెరుగుటకు తల్లి తండ్రి కూడా ఎట్లవసరమో సంఘానికికూడ సంఘసేవాసంస్థలు, ప్రభుత్వం ఉండాలి సంఘసేవకులు తల్లులవలె ప్రవర్తించగలరు. కనుక యిట్టి సంస్థ చాల అవసరము ఈ సంస్థయందు 500 మంది సభ్యులున్నారు. అందరు మరుడుగా పని చేయక పోవచ్చు. కాని పనిచేయనివారు గూడ, గ్రామాలలో చెల్లకపోయినా విలువగల కరెన్సీ నోట్లవలె ఉపయోగపడగలరు. (నవ్వు) మనరాష్ట్రానికి వందలు చాలదు వేలకొలది సంఘసేవకులు అవసరం.

"ప్రభుత్వానికి సంఘసేవా సంస్థలకు పొత్తు వెనుకటికి యిప్పటికి మారినది. వెనుక ప్రభుత్వమే యీ సంస్థలను తన ప్రయోజనముల కుపయోగించుకొనెను. ఇపుడు యీసంస్థలే ప్రభుత్వాన్ని ఉపయోగించుకుంటున్నవి ప్రభుత్వశోకర్షంతస్థమున్నది. అది సహజమే. పురుషులకు మాత్రం ఒక మాట చెప్పదలచితిని స్త్రీలు చెవులు మూసుకోవచ్చు. మనమంతా మన భార్యల కెంత లొంగియున్నామో పురుషులకు తెలుసు. అట్లే ప్రభుత్వంగూడ సంఘసేవా సంస్థలకు లొంగిపోవుచున్నది. ఏమంటే, వారి భార్యలు యిందు సభ్యులుగా చేరుచున్నారు. ఈ ప్రభుత్వం ఆ ప్రభుత్వం కన్నా బలవత్తరమగుచున్నది స్త్రీలు నానాటికి బలవంతులగుచున్నారు. వారికి వోట్లు వచ్చినాక పురుషులం విరమించుట మంచిది. యీ సంస్థలో చేరిన స్త్రీలంతా హృదయపూర్వకంగా కష్టించి పనిచేసినామాట నిజం చేయాలి. వారు సంపాదించిన పలుకుబడి, బలం నిలబెట్టుకొనేందుకు ప్రయత్నించాలి.

"క్రొత్త రంగాలలోకి ఉద్యోగాలలోకి ప్రవేశం దొరికింది కదా యని, స్త్రీలు సహజసిద్ధంగా తరతరాలనుండివారు చేయుచున్న చేయగలసంఘ సేవాకార్యములను విడువరాదు.

"ప్రభుత్వ మందిరాలలో చేరిన యీ సేవాసమాజం స్త్రీలు టీత్రాగి పాటలు పాడి ఆనందిస్తారు. చక్కగ అలంకరించుకు తిరుగుతారు. పనిచేయరని ప్రజలనుకుంటారు. ఆ అభిప్రాయం పోగొట్టుటకు, మీరు ప్రజలలో తిరిగి పనిచేయాలి. చక్కగఅలంకరించుకొని తిరిగి స్త్రీలు పని చేయరని నేనూ అనుకునే వాడను. కాని యిది పరీక్షించాను. వారును బాగా కష్టపడి పనిచేయుకలరని నాభిజ్ఞ అనుభవంవల్ల తెలిసింది" అని రాజాజీ నుడివిరి.

## గవర్నరు విందు

గవర్నరుగారు ఆదివారం సాయంకాలం గిండీలో తమ భవనమునందు గవర్నరు జనరలు గౌరవార్థము సుమారు 650 మందికి విందు చేసిరి.

గవర్నరు జనరలుగారు ఉదయం ప్రధాని కుమారస్వామి రాజా, న్యా॥ బషీరు అహమ్మదు సాహేబు, జనాబు యూసఫ్ సేటు, పి. ఎస్. దేశికాచారి, డా॥ రామనాథ చెట్టియార్, డా॥ సయ్యదునియమతుల్లా, ఎస్. ఎస్. వరదాచారి గార్లకు ప్రత్యేకంగా దర్శనమిచ్చిరి.

అఖిలభారత స్వదేశీ ప్రదర్శన ప్రారంభోత్సవం జరుపుతున్న దృశ్యం

రాజగోపాలాచారిగారు తమిళనాడు కాంగ్రెసు సంఘం ఏర్పాటుచేసిన ఖాదీ స్వదేశీ ప్రదర్శనానికి ప్రారంభోత్సవం జరుపబోతున్న దృశ్యం.

## మద్రాసు నగర పోలీసు చట్ట సవరణ

### న్యాయశాఖా మంత్రి బిల్లుకు అసెంబ్లీ ఆమోదం

చెన్నపట్నం, డిసెంబరు 19: నేడు రాష్ట్ర అసెంబ్లీలో న్యాయశాఖా మంత్రి శ్రీ మాధవమీనన్‌గారు మదరాసు నగర పోలీసు చట్టం సవరణబిల్లును ప్రతిపాదించిరి. అరెస్టు అధికారము యిదివరకు పోలీసు కాన్‌స్టేబుళ్లకు సయితము సంక్రమించెననియు యిపుడీ సవరణబిల్లుతో అధికారము సబ్ ఇన్‌స్పెక్టరు హోదాకు తక్కువకాని ఉద్యోగికి నివ్వబడునని. అరెస్టుచేసిన బిచ్చగాండ్రను బిచ్చగాండ్రశాలకు పంపునపుడు రెండేండ్లకు మించి వారిని అక్కడనుంచుటకు ప్రస్తుతము అవకాశములేదనియు, ఆ గడువు తరువాత ఒకవేళ యే బిచ్చగాడైనా అక్కడే ఉండుటకు యిష్టపడితే అట్టివారు అక్కడ నుండుటకు యీ సవరణ బిల్లు అవకాశమొసగుచున్నదనిరి.

అబ్దుల్ హమీద్ ఖాన్‌గారు చేతిబండ్లలాగేవారి విషయమున కొన్ని నిబంధనలు యీ పోలీసు చట్టములో చేర్చడం అవసరమనిరి.

శ్రీ ఆర్. వి స్వామినాథన్‌గారు 16 యేండ్లకు తక్కువ వయస్సు గల పిల్లలు బిచ్చమెత్తడం నిషేధించుచూ సవరణ నుండవలెననిరి. అబ్దుల్ మజీద్ రజాఖాన్ డా॥ రామచంద్రరావుగార్లు కూడా బిల్లులోని సవరణలు మంచివిగా నున్నవని ఆమోదించిరి.

శ్రీ డి. వి రామస్వామిగారు బిల్లును మనఃపూర్వకముగా ఆమోదిస్తూ బిచ్చగాండ్రను ఆ వృత్తినుండి తప్పించుటకు శరణాలయాలు ఏర్పడుట అవసరమనిరి.

మంత్రి మాధవమీనన్‌గారు విమర్శలకు బదులు చెప్పుచూ సవరణబిల్లు బిచ్చమెత్తడమును నిర్మూలించుటకు ఉద్దేశించబడలేదనియు, మేజస్ట్రేటులు శరణాలయాలకు పంపే బిచ్చగాండ్రువారి శిక్షాకాలము అయిన తరువాతకూడా అందులో నుండుటకు అవకాశమిచ్చుటకే యీబిల్లు నుద్దేశించుచున్నదనిరి.

తరువాత సభవారు బిల్లును శాసనముగా ఆమోదించిరి.

#### శిస్తు తగ్గింపు చట్టం

మదరాసు ఎస్టేట్లలో శిస్తు తగ్గింపు సవరణ బిల్లును రివిన్యూ మంత్రి శ్రీ హెచ్. సీతారామరెడ్డిగారు ప్రతిపాదించుచూ ధర్మాదాయ సంస్థలకు తమ ఎస్టేట్లవల్ల 1357 ఫస్లీకి పూర్వము 5 యేండ్లలో సామాన్య ఆదాయమునకంటే తక్కువ నికరాదాయము వచ్చియున్నట్టయితే ఆ తేడా మొత్తములను ఆమోదించుటకు యీ సవరణ అవసరమైయున్నదనిరి.

శ్రీ పైడా వెంకటనారాయణగారు బిల్లును ఎదిరించుచూ సెలక్టుకమిటీవారీవిషయము యిదివరకే ఆలోచించినారు గనుక యీ సవరణ అనవసరమనిరి.

శ్రీ బద్దిపూడి వెంకటనారాయణరెడ్డిగారు ధర్మాదాయముల సంస్థలకు లభింపచేసేసవరణకు ఎవరూ ఆక్షేపణ చెయ్యరనియు, డిమాండు మొత్తములో పూర్తి వసూలు సరిగా కావటంలేదు గనుక డిమాండును ఆధారము చేసుకొనియే లెక్కకట్టుట మంచిదనిరి.

మంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు బిల్లులోని అసందిగ్ధతను తొలగించి విధిగముగా నొనర్చు ఉద్దేశ్యముతో మాత్రమే యీ బిల్లు తేబడినదనియు ధర్మాదాయ సంస్థలకు ఎంత సొమ్ము రావలసి యుండునో దానిని భర్తీ చేయుటకే యీ బిల్లు తలపెట్టుచున్నదనిరి.

ఆ మీద సభవారు మదరాసు ఎస్టేట్ల శిస్తు తగ్గింపు సవరణ బిల్లును శాసనముగా ఆమోదించిరి.

అ. భా. ఖాదీ స్వదేశీ ప్రదర్శనలోని విద్యానగరంలో అంధ పాఠశాల బాలుర పాటకచేరీ.

గవర్నర్ జనరల్ శ్రీ రాజగోపాలాచారిగారు డిసెంబరు 18 వ చెన్నపట్నంలో నావికాదినోత్సవంలో పాల్గొన్నారు. ఆ సందర్భంలో స్థానిక నావికాధికారు ఏర్పాటుచేసిన విందులో ఆయన ఉపన్యసిస్తున్న దృశ్యమిది.

అమెరికా - భారతదేశముల స్నేహసంబంధములను వృద్ధిచేయుటకు మార్గముల నన్వేషించుటకు ప్రస్తుతము న్యూఢిల్లీలో రెండుదేశములకు సంబంధించిన ప్రముఖుల సమావేశము జరుగుచున్నది. 12-వ తేదీన ఈ సమావేశమును భారత పరిశ్రమల మంత్రి డాక్టర్ శ్యామప్రసాద్ ముఖర్జీగారు ప్రారంభించిరి. పండిట్ హృదయనాథ కుంజ్రూగారు అధ్యక్షత వహించిరి. ఆనాటి సమావేశములో వాషింగ్టన్ విశ్వవిద్యాలయ అధ్యక్షుడు, అమెరికా ప్రతినిధి వర్గ నాయకుడు ఆయన ప్రొఫెసర్ ఆర్థర్ హోలీ కాంప్టన ఉపన్యసిస్తున్నారు.

## గుంటూరు జిల్లాలో తుపాన్ బాధితులకు సహాయం

### ఇంతవరకూ జరిగిన కార్యక్రమాన్ని వివరిస్తూ జిల్లాసంఘ సమావేశంలో కలెక్టర్ ప్రకటన

గుంటూరు, డిసెంబరు 17: నిన్న మధ్యాహ్నం జిల్లాకలెక్టరు ఆఫీసులో జిల్లాకలెక్టరు ఎస్. కనకసుందరంగారి అధ్యక్షతను జిల్లా వరదబాధిత సహాయ సంఘ సమావేశం జరిగింది. అధ్యక్షులు ప్రప్రథమంలో యిం తవరకు జరిగినపని వివరాలను తెలియపరుచుతూ యికముందు జరుగవలసిన కార్యక్రమాన్ని వివరించారు. ప్రభుత్వంవారు బాధితుల సహాయార్థం మంజూరుచేసిన మొత్తంలో యింకా సుమారు రు. 7800 లు మిగిలియున్నదనీ, చందాలవల్ల పోగుచేసిన మొత్తములో యింకా రు. 2,28,000 మిగిలియున్నదనీ, యీ మొత్తముతోను యింకా చాలక పోయినచో కొంతమొత్తం సేకరించి అదర్శప్రాయమైన మూడుపేటలు గుంటూరు, తెనాలి, ఒంగోలు డివిజన్లలో ఒక్కొక్క డివిజనులో ఒక్కొక్కటి నిర్మించుటకు లోగడ తీర్మానం జరిగిందనీ, అన్నారు. బాధితుల సహాయార్థం వస్త్రములు, పాలపొడరు, నష్టపోయిన చేనేత మగ్గములను బాగుచేయించుకొనుటకు సహాయము, మరణించినవారి కుటుంబములకు సహాయము మొదలైన కార్యక్రమ వివరాలను అధ్యక్షులు తెలియజేశారు అదర్శప్రాయమైన పేటల నిర్మాణం విషయములో, హరిజనులకు యింటి స్థలమును రాష్ట్ర హరిజననిధినుంచి యిచ్చుటకు, యితరులకు తమవద్దనున్న ధనము నుండి కొనుటకు నిర్ణయం చేశారు. చందా రూపంగా సేకరించినవస్త్రములను ముందుగా పంచిపెట్టి, తర్వాత బక్కింగ్ హామ్ కర్నాటిక్ మిల్లువారినుండి 14 పేళ్లు అనగా 2150 కంబళ్లులు కొని పంచిపెట్టుటకుకూడ నిర్ణయము చేశారు. పాడైపోయిన మగ్గములకు మగ్గము ఒకటికి రు 20 ల వంతున యివ్వటానికి తీర్మానించారు. పాలపొడరు విషయములో రాష్ట్ర యోగక్షేమ సంఘం వారు పంపిన 25 పీపాలు, పాలరూపంలో పంచుటకు దానికగు బెల్లము మొదలగు ఖర్చులను సంఘంవారు భరించుటకు నిర్ణయించారు. మరణించిన వ్యక్తులుగలకుటుంబాలకు కలెక్టరుగారే ఒక్కొక్కరి విషయము విచారించి మంజూరు చెయ్యాలనీ, ప్రజా ఆర్థికనిధినుండి కోరుటకును నిర్ణయించారు. (స్వ వి)

అల్పాహారవిందు చేశారు. అనంతరం తుపాను బాధితులకు స్త్రీ పురుషులకు 400 మందికి కలెక్టరుగారు వస్త్రములు పంచిపెట్టారు. తుపానుబాధితుల సహాయం సంఘం తరపున కలెక్టరుగారికి వెంకటరామయ్యగారు కృతజ్ఞత వెల్లడించారు.

### తుపాను, వరద బాధితులకు వస్త్రదానం

తెనాలి, డిసెంబరు 18: తుపాను, వరద బాధితులకు ప్రభుత్వం తరఫున వస్త్రదానం చేయుటకుగాను గుంటూరుజిల్లా కలెక్టరు యస్. కనకసుందరంగారు నిన్న నిక్కడికివచ్చారు. తెనాలి డిప్యూటీ కలెక్టరు జి. రామమూర్తిపంతులు, తహసిలుదారు జి. వి. చలపతిరావు, యం. సత్యనారాయణ, డిప్యూటి రిజిస్ట్రారు టి. వి. రత్నంగార్లతో కొటూరు వెళ్లారు. అక్కడ తుపాను, వరద బాధితుల సహాయకసంఘం తరపున కొసరనేని అంకినీడుగారు కలెక్టరు ప్రభృతులకు అల్పాహార విందు చేశారు. తరువాత క్రాప, చావికంపాడు వగైరా గ్రామాలకు తుపాను వరద బాధితులకు స్త్రీలకు పురుషులకు జిల్లా కలెక్టరుగారు వస్త్రదానము చేశారు. మధ్యాహ్నం యడ్లపల్లి గ్రామం వెళ్లారు. అచ్చట అలపాటి వెంకటరామయ్యగారు









Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhr Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.